

# మాతృశ్రీ

# తపస్యా చతుష్టయము
# విమోచన చతుష్టయము

అనువాదకులు:

మహాకవి, శ్రీ గడియారము వేంకట శేషశాస్త్రిగారు,

ప్రొద్దుటూరు.

# తపస్యా చతుష్టయము - విమోచన చతుష్టయము

## 1

ప్రతిమానసికోపలబ్ధికి దారిచూపు పరిపూర్ణవిద్యను సాధిం చుట కీ తపస్యాచతుష్టయము విమోచనచతుష్టయము ఆవశ్యకములైనవి.

తపస్య యనఁగా శరీరమును కృశింపఁజేయుటయని సాధారణముగాఁ గలత పుట్టించును. తపస్యనుగూర్చి మాట లాడునపుడు,—సన్న్యాసులైనవారు శరీర ప్రాణ మానసము లతోఁగూడిన యీ జీవితము నిట్లే యాధ్యాత్మికముచేయు భారమును దప్పించుకొనుటకు మార్గము వెదకుచుందురు గనుకనే—"ఈ జీవితము మార్చుటకు సమర్థముకానిదనియు, వ్యర్థమైనభారమనియు, ఒక నిర్బంధమనియు, ఆధ్యాత్మికాభి వృద్ధి కిది యొకసంకెలయనియు, నిష్కారణముగఁ ద్రోసివేయ వలసినదనియు" వెల్లడించు చుందురు. అట్టిసన్న్యాసుల శిక్షణ పద్ధతియే తపస్యయని యెవఁడైన నాలోచింపవచ్చును. ఏమైనను, "ఈజీవిత మెన్నటికిని సరిదిద్దుటకు వీలుకానిది, దైవమో ప్రకృతియో దీనిని మరణముతో దించివేయుకాలము వచ్చు వరకు నీబరువించుమించు చిఱునవ్వుతో వహింపవలసినదే"

మని వారు తలంచిరని దీనిభావము. ఇంతకంటె మేలుగా భావించినచో: "ఈభూమిపై జీవితము మన పురోభివృద్ధి కొక శిక్షణరంగము. ఎవఁడైనను తాను సాధింపఁగలిగినంత లాభము దీనినుండిపొందుటకుఁ దప్పక ప్రయత్నింపవలెను. ఇందుపై నే ప్రయత్న మక్కఱలేదనునంతటి పరిపూర్ణతా కక్ష్య నందుకొనుటకుఁ జాలినంతత్వరగా ముందుగాఁ బ్రయత్నింపవలె" నని వారియాశయ మనవచ్చును.

ఎట్లైనను, మనకు సంబంధించినంతవర కీసమస్య మిక్కిలి భిన్నమైనది. "ఈభౌమిక జీవితమొక రహదారిగాని, కేవల మొక సాధనముగాని కా" దనియు, "పరివర్తనపద్ధతిద్వారా ఇది యొకలక్ష్యముగా నొకసిద్ధిగాఁ దప్పక కావలయు" ననియు మనము తలఁచుచున్నాము. తపస్యనుగూర్చి మనము మాటలాడునపు, డీ తపస్య శరీరమునుండి మనలను వేఱుచేయు తలంపుతో ఆ శరీరమునుగూర్చిన తిరస్కారముకాదు. మఱి యేమనఁగా, ఆత్మనిగ్రహము కొఱకును ఆత్మాధిరాజ్యము కొఱకు నత్యావశ్యకమైనదిది. ఎందుకనఁగా: సన్న్యాసుల అన్నితపస్యలకంటెఁ జాల గొప్పదియు, మిగులఁ బరిపూర్ణమైనదియు, మిక్కిలి కష్టమైన తపస్యయొకటి గలదు. అది పరిపూర్ణ పరివర్తనమున కవసరమైనది; అతిమానస సత్యము యొక్క వ్యక్తీకరణమునకు ఒకొక్కవ్యక్తిని తయారుచేయునది. ఇది చతుర్విధమైనది. ఈవిధముగా శారీరక పూర్ణసిద్ధి

కొఱకు శరీరశిక్షణము విధించు తపస్యలకంటె మఱికొన్ని తపస్య లంత కఠినమైనవి కావని యెవఁడైన నుదాహరణము నకుఁ జెప్పవచ్చును. ఆ విషయమును గుఱించి సమయము వచ్చినపుడు మేము ప్రస్తావింతుము.

ప్రసక్తమైన తపస్యాచతుష్టయమునుగూర్చి ముచ్చటించుటకుఁ బ్రారంభించుటకు ముందే యనేకుల మనస్సులలో విభ్రమము నపార్థమును గలిగించుటకు మూలాధారమైన యొక ప్రశ్నను నేను స్పష్టముగా వివరింపవలసియున్నది. అది సన్న్యాసులు ఆధ్యాత్మిక శిక్షణముగా గ్రహించు పారివ్రాజికాభ్యాసములను గూర్చినది. ఈ యభ్యాసములు శరీరమును నీచభావముతోఁ గష్టపెట్టుటకుఁ జేరినవి. ఇవి యాత్మను శరీరమునుండి స్వచ్ఛందము చేయునవని కొంద ఱనవచ్చును. కాని, నిజమున కవి యాధ్యాత్మిక శిక్షణములో నింద్రియములను వికృతముచేయునవే యగును. ఇది "కష్టపాటు ఆవశ్యకము" అనునొక విపరీతబుద్ధి. ఇదియే సన్న్యాసుల నాత్మశోషణమునకుఁ బ్రేరేపించుచున్నది. సాధువుల ములుకుల పడకలు, క్రైస్తవుల కొరడాలు—నారగుడ్డలు,—ఇట్టివన్నియు నించుమించుగాఁ దెరమఱుగుననుండి బహిరంగముగాఁ బ్రకటింపఁబడనివియుఁ—బ్రకటించుటకుఁ దగనివియు నగు "సాడిజము" (హింసను ప్రేమించువృత్తి) యొక్క ఫలితములేయగును. ఇది యొక యపథ్యాపేక్ష—లేక—తీవ్రమైన యింద్రియ స్పందనము

లకై యథేచ్ఛతన మారాట పడుటయగును. నిజమున కివన్నియు నాధ్యాత్మికజీవితమునకుఁ జాల దూరమున నున్నవి. ఇవి వికృతములు, నీచములు, అంధకారమయములు, ఆధివ్యాధి గ్రస్తములు: ఇందుకు భిన్నముగా, ఆధ్యాత్మికజీవితము వికస న—సమస్థితులు, సౌందర్యోల్లాసములు గల యొక యుత్తమ జీవితము. పైసన్న్యాసి శిక్షణములు శరీరముపై కష్టపాటును విధించు నొకవిధమైన ప్రాణమనః క్రౌర్యములచేఁ గల్పింపఁ బడి శ్లాఘింపఁ బడినవి. అయినను, క్రూరత్వ మనునది తన శరీరముపై తాను చూపినను అది తక్కువకాని క్రూరత్వమే యగును. వివిధమైన క్రూరత్వమంతయుఁ జైతన్యాభావము యొక్క ముఖ్యచిహ్నమే యగుచున్నది. అచేతనప్రకృతులకు బలమైన యింద్రియ స్పందనము లవసరములు. ఎందుకనఁగా, అవి లేకున్న నా యచేతనప్రకృతు లేమియు భావింపఁజాలవు. మఱియుఁ, గ్రూరత్వమనునది తీవ్రములైన యింద్రియ స్పంద నములను గలిగించు నొకవిధమైన 'సాడిజ' మే యగును. ఇట్లు, అన్నివిధములైన యింద్రియ స్పందనముల వర్జింప వలయుననుటే ఈ యభ్యాసములయొక్క ప్రకటిత ప్రయోజ నము—ఎందుకనఁగా: ఆత్మాభిముఖముగా నెగురుచున్న తన కీ శరీరము చిరకాల మాటంకముగా నుండఁగూడదనియే దాని యుద్దేశము. అయినను, ఈ సాధనముయొక్క సార్థ క్యము సందేహింపవలసి యున్నది. "సత్వరాభివృద్ధిని గోరు

వాఁడు కష్టములకు భయపడఁగూడ" దను సత్య మందఱెఱిఁగి
నదియే. కాని, దీనికి విరుద్ధముగా: "ఒకఁడు కష్టములైన
పనులను పట్టిగాఁ గోరుకొనుటచేతనే ఆయా సమయము
లందు అతని ఇచ్ఛాశక్తి నెక్కువచేసికొనుటకును క్రియాశక్తిని
బలపఱచుకొనుటకు నవకాశము తనంతకుఁదానే వచ్చు"
ననియుఁ గలదు. నిజ మాలోచించినచో: భోగ విలాసములను
దుర్వినియోగముచేయుట, సన్న్యాసిత్వమును తిరస్కరించు
టతో ఆభోగ విలాసములు చేయు రహస్యప్రవృత్తి, అవి
తెచ్చిపెట్టు విచ్ఛేదకపరిస్థితి—ఈయన్నిటితోఁ బోరాడుట
కంటె, ఒక నియతియు నిలుకడయు సమత్వగాంభీర్యములు
గల జీవితము నడుపుటయే చాలఁ గష్టతరమైనది. ఈ శారీరక
జీవితము నిరుపయోగమని దానిని జివరవరకుఁ దగ్గించి నీచ
పఱచుటకంటెఁ, ప్రశాంతి నిరాడంబరత్వములతోఁ గూడిన
యీ శారీరక జీవితమునందే పరస్పర స్నేహ సమ్మిళితము
పురోగమనశీలమైన యభివృద్ధిని సాధించుట నిజముగా మిగులఁ
గష్టతమమైనది. ఒకఁడు తన జితేంద్రియత్వమును సగర్వ
ముగాఁ బ్రకటించుకొనుటకై శరీరమున కనివార్యావశ్యకము
లైన సదభ్యాసములను పోషణములను లేకుండఁ జేయుట
కంటె, సమస్థితికముగా, గాంతాసారహితముగా జీవితము
నడుపుట మిక్కిలి కష్టతమమైనది. రోగములు తమపని
యగు వినాశమును దాము చేయుఁగాకని వాని నలక్ష్యము

చేయుటకంటె నుపేక్షించుటకంటె, బాహ్యాభ్యంతరైక శ్రుతీ కరణముతోను బరిశుద్ధతా సమత్వములతోను ఆరోగములను దగ్గరికి రానీయకుండుటయు ఉల్లంఘించుటయు జయించుటయు అత్యంత కష్టతమములు. పై యన్నింటికంటెను చైతన్యము దాని సమర్థతా శిఖరమునం దెల్లప్పుడు నిలిచియుండునట్లు కాపాడుకొనుటయు, శరీరమును నీచప్రేరణముల పలుకుబడి క్రిందఁ బనిచేయకుండునట్లు చూచుకొనుటయు మిగులఁ గష్ట తమములైనవి.

ఈ లక్ష్యసిద్ధికొఱకు మనము తపస్యాచతుష్టయమును దప్పక యవలంబింపవలెను. అదియే విమోచన చతుష్టయము మును ఫలింపఁజేయును. వీనియొక్క యనుష్ఠానమే చతుర్విధ శిక్షణము—లేక—తపస్యగా నేర్పడును. దీనినే క్రిందివిధముగా నిర్వచింపవచ్చును.

(1) ప్రేమ తపస్య

(2) జ్ఞాన తపస్య

(3) శక్తి తపస్య

(4) సౌందర్య తపస్య.

పైనుండి దిగువకున్న యీక్రమమునుగూర్చి చెప్పునప్పు డీ వరుసలో నేదైనను శ్రేష్ఠమైనదనిగాని తక్కువైనదనిగాని, ఎక్కువగనో తక్కువగనో కష్టమైనదనిగాని, ఈవరుసలోఁ జెప్పఁబడినట్లే యీశిక్షణములు తప్పక యనుసరింపఁబడఁ

గలవి—అనుసరింపఁబడ వలసినవనిగాని యర్థము చేసికొనఁ గూడదు. పైవరుసయుఁ, బ్రాముఖ్యము, లేక కష్టము ఆయా వ్యక్తులనుబట్టి యేర్పడునదేగాని "ఇది యిట్లే" యని నియమముచేయుటకు వీలులేదు. ప్రతియొకఁడును తన శక్తికిని దన ప్రత్యేకావసరమునకును దగినట్లుగాఁ దానే యొకపద్ధతిని గుర్తించుకొని యనుష్ఠానము చేయవలెను.

ఇచ్చట నొక యాదర్శప్రాయమైన క్రమవిధానమును సాధ్యమైనంత సంపూర్ణముగాఁ బ్రదర్శించునట్టి యొక సామూహిక పద్ధతి మాత్రమే చూపింపఁబడును. అప్పుడు ప్రతియొకఁడును దానెంత శ్రేష్ఠముగాఁ జేయఁగలఁడో యా పద్ధతిలోఁ దన సొంతమైన ప్రయోగమును దాను జేయగలిగినంతవరకు సిద్ధము చేసికోవచ్చును.

సౌందర్యతపస్య—లేక—సౌందర్యశిక్షణము శారీరక జీవిత నియమములద్వారా క్రియాస్వాతంత్ర్యమునకు మనలఁ దీసికొనిపోవును. మూల ప్రాతిపదికమైన యీప్రణాళిక శరీరమును ఆకారమున నందమైనదానినిగ, అంగవిన్యాసమున అన్యూనాతిరిక్త సమ్మేళనము కలదానినిగ, కదలికలయందు మృదువుగ నొదుగుదానినిగ, చులకనైనదానినిగ, కార్యములయందు శక్తిమంతమైనదానినిగ, ఇంద్రియాదిక వ్యాపారములయందు—ఆరోగ్యరక్షణమందు నిగ్రహముగలదానినిగ నిర్మించఁగలదు.

ఈఫలితములను బొందుట కాధిభౌతికజీవితమును వ్యవస్థీకరించుటయం దొక సహకారముగాఁ గొన్నియభ్యాసముల నేర్పఱచుకొని వాని నుపయోగించుట యొక సాధారణపద్ధతి యందు మంచిది. ఎందుకనఁగా: ఈ శరీరము నియతమైన క్రమచర్యారూపమైన చక్రమున మిక్కిలి సుకరముగాఁ బని చేయును. ఎట్లైన, నెవఁడైనను తన యలవాట్లెంతమంచివైనను వానికి బానిస కాకుండునట్లు సమర్థుఁడు కావలెను. అత్యున్నతమైన—అభిమతరూప ధారణోచితమైన మృదుత్వమును తప్పక సాధించి నిలుపుకొనవలెను. ఎందుకనఁగా, సమయమువచ్చినపు డక్కరపడినపుడెల్లఁ దన యలవాట్లను మార్చుకోవచ్చును. ఎవఁడైనను, సంకోచ వికోచములను స్వచ్ఛందముగఁ బొందునట్టి బలిష్ఠములైన కండరముల కూర్పులో ఉక్కువంటి నరములను తప్పక వృద్ధిపొందింపవలెను. అట్లుచేసినపుడే యతఁడు అపరిహార్యమగు నవసరము వచ్చినపుడెల్ల దేనినైన సహించుకొనుటకు సమర్థుఁడుగా నుండును. అయినను, అట్లుచేయునప్పుడే ఆయా కార్యములకు కచ్చితముగా అవసరమైనంతకంటె నెక్కువ ప్రయత్నమును, అభివృద్ధికిఁ బురోగమనమునకు నవసరమైనశక్తికంటె నెక్కువ శక్తిని—శరీరమునుండి కోరకుండునట్లును, ఆధిభౌతికాణువులను శిథిలపఱచి నిర్మూలించి యంతము పొందించుటకు దారిచూపునట్టియు, నిస్సారపఱచు అలపును బుట్టించునట్టియు కార్య

ముల నన్నింటిని మిక్కిలి కఠినముగా విసర్జించునట్లును తప్పక శ్రద్ధతీసికో వలెను.

ఉత్తమతర చైతన్యమునకొఱకుఁ దగిన సాధనముగాఁ బనిచేయు సమర్థమైన శరీర నిర్మాణమును లక్షించునట్టి శారీరక శిక్షణము మిక్కిలి తీవ్రములైన యభ్యాసములను విధించును. నిద్రయందును ఆహారమునందును శరీర వ్యాయామము లందును తక్కిన యన్నికార్యములందుఁగూడ అత్యంతమైన క్రమప్రవర్తనములే ఆ యభ్యాసములు. ప్రతియొకఁడును దన శరీరావసరములను ముందుగా కచ్చితముగాఁ బరిశీలింప వలెను. ఎందుకనఁగా, ఆయవసరము లాయా వ్యక్తులనుబట్టి భిన్నముగానుండును. తరువాత నొక సాధారణకార్యక్రమము నేర్పఱచుకొనవలెను. ఒకసారి కార్యక్రమము నిర్ణయింపఁ బడినతరువాత నది యెట్టిచాపల్యముచేతనైన నెట్టిసోమరితన ముచేతనైన మార్పు చెందకుండునట్లు నియమితమైన దీక్షతోఁ దప్పక యనుసరింపవలెను. తన నియమమునకు "ఏదోయొక సారితె"మ్మనునట్టి యెట్టి మినహాయింపులకును చనవియ్యఁ గూడదు. ఎందుకనఁగా, ఆ మినహాయింపులు పలుమారు కోరఁబడవచ్చును. "ఒక్కసారియేగదా" యని మఱలుకొను టకు నీవు లోఁబడినచో నీసంకల్ప నిగ్రహశక్తిని నీవు తగ్గించుకొన్నవాఁడ వగుదువు. అంతేకాదు; ప్రతిపర్యాయము ప్రతియొకదానికి నోడిపోవుటకు నీవు తలుపు తెఱచినవాఁడవగుదువు.

అట్టి బలహీనత లన్నిటికి నీవు తప్పక గడియవేయవలెను. నిన్నుఁ బూర్తిగాఁ జెఱచి, వెనుకకు నెట్టు ఏచీకటి తప్పులు చేయఁగూడదు. జీర్ణకోశముయొక్క సాధారణ కృత్యములను తారుమారుచేయు విందులుగాని వెక్కసముగా భుజించుట గాని కూడదు. నిత్యకృత్యములు చేయుటలో నిన్ను మిక్కిలి కలవరపఱచునట్టియు నీ యంతస్సారమును వ్యర్థముచేయునట్టి బహుకార్యపరత్వము దుష్ప్రవర్తనము వినోదలంపటత్వము మొదలగునవి కూడవు. ఎవ్వఁడైనను, శరీర మెంతపరిపూర్ణ పరిశుద్ధమగుటకు వీలగునో అట్లు దానిని సిద్ధముచేయు విషయమై సమస్తమైన శారీరక విధుల నేకోన్ముఖముగా సమీకరించుచు, వివేచనాయుతము విహితకార్యక్రమ బద్ధము నగు జీవితమును నడుపు తపస్యను తప్పక యనుష్ఠింపవలెను. ఆదర్శప్రాయమైన యీ లక్ష్యమును జేరుటకుఁ బ్రతియొకఁడును చిన్నవో గొప్పవో యగు సమస్తములైన యధికప్రవృత్తులను దుష్ప్రవృత్తులను కచ్చితముగా వర్జింపవలెను. మానవుని యభ్యాసములలోఁ ద్రోసివేయరాని యవసరములుగా వృద్ధిపొంది, క్రమముగా నతని యిచ్ఛాశక్తిని జ్ఞాపకశక్తిని నాశనముచేయు—పొగాకు, మద్యసారము మున్నగువానివంటి—అనుల్బణ విషములను మానవుఁడు తనంతకుఁ దానే విడిచి పెట్టవలెను. ఏ మినహాయింపు లేకుండ, మానవు లందఱును—ప్రతిభావంతులలో ననేకులుకూడ—ఆహారమునందును

దానిని సిద్ధము చేయుటయందును భుజించుటయందును సర్వాకర్షణలతో నేశ్రద్ధచూపెదరో ఆ శ్రద్ధాస్థానమునందు శరీరావసరములకొఱకు రమారమి రాసాయనిక శాస్త్రజ్ఞానమును, ఆ శరీరావసరములను దృప్తిపఱచు మార్గమునందు ఈ తపస్యయొక్క పరిపూర్ణశాస్త్రీయ పద్ధతిని ఉపయోగింపవలెను. ఆహారమునుగుఱించిన యీ తపస్యకుఁ దోడుగా నిద్రనుగూర్చిన మఱియొకతపస్యను తప్పక నేర్చుకోవలెను. ఇట్లు చెప్పుటవలన నిద్రలేకుండ నుండవలెననికాదు—ఎట్లు నిద్రపోవలెనో దానిని దప్పక తెలిసికోవలెనని యర్థము. నిద్ర యనఁగా: శరీరమును సేదదీర్చుటకుబదులు దానిని మొద్దుబడినదానినిగాఁజేయు అచేతనత్వమునందు పడవేయుట కానే కాదు. మితాహారము, అన్నివిధములైన యమితత్వముల విసర్జించుట యనునవి తమంతకుఁ దామే నిద్రయందు బెక్కుగంటలను గడుపవలసిన యవసరమును చాలమట్టుకుఁ దగ్గించును. ఎట్లైనను, నిద్రయొక్క రాశికంటె గుణమే ముఖ్యమైనది. నిద్ర మీకు నిజముగాఁ బ్రయోజనకరమైన విశ్రాంతిని నెమ్మదిని ఇయ్యవలెనన్న మీరు నిద్రపోవుటకు ముందేదోయొక యాహారమును — ఉదాహరణమునకు, ఒక గిన్నెడు పాలుగాని చారువంటి ఉడికిన పదార్థముల సారముగాని పండ్ల రసముగాని—తీసికొనుట మంచిది. తేలికైన యాహారము ప్రశాంతమైన నిద్ర నిచ్చును. ఎట్లైనను అమితాహారము తప్పక

విసర్జింపవలెను. ఎందుకనఁగా, ఆ యమితాహారము నిద్ర కంతరాయము గలిగించును; భయంకర స్వప్నాదులవలనవచ్చు ఒకవిధమైన గుండెబరువుతోఁ గలవరము పుట్టించును; లేక మరియొక విధముగా,ఎడ తెగని దానినిగా—బరువైన దానినిగా మొద్దువాఱినదానినిగాఁ జేయును. కాని, ఇందు చాల ముఖ్యమైన విషయమేమనఁగా—మనసును నిర్మలముగా నుంచుకొనుట: భావస్పందనములను శాంతపఱచుట: కోరికలను, ఉద్రేకములను, ఆ కోరికల వెంటనుండి ముందే మనసు నాక్రమించుకొనియున్నవానిని నెమ్మదిపఱచుకొనుట. పండుకొనుటకు ముందెవ్వఁడైనను ఉద్రేకము పుట్టించుచర్చలు చేసినను, లేక ఆవేశము పుట్టించునదో అభిరుచి కలిగించునదో యగు నేదో యొకదానినిఁ దీవ్రముగాఁజదివినను, అట్టివాఁడు నిద్రపోవుటకు ముందు కొంతకాలము విశ్రాంతి తీసికొనుటమంచిది. అట్లు చేసినయెడల మనసుచేయు నాలోచన లన్నియు శాంతిపడ వచ్చును; మఱియు శరీరాంగములుమాత్రమే నిద్రపోవుచుండఁగా మెదడు క్రమముదప్పిన యాలోచనలకు లోఁబడకుండును. మఱియొకపక్షములో: నీవు ధ్యానమున కలవాటుపడినవాఁడవైనచో ఇంతకంటె నున్నతము విశాలమునైన చైతన్యమువైపు ఆకాంక్షించుచు, ఉన్నతమైన శాంతిప్రదమైన యాశయముపైఁ గొన్నినిమేషములు నీవు మనసు నేకాగ్రము చేయుట మంచిది. అప్పుడు నీవు నిద్రవలన మిక్కిలిలాభము పొందఁగలవు.

మఱియు, నిద్రపోవునప్పుడు నీవు చైతన్యాభావమునందుపడి పోవు అపాయమునుండి చాలభాగము దప్పించుకొనఁగలవు.

నెమ్మదియుఁ బ్రశాంతియునిండిన నిద్రలో పూర్ణవిశ్రాంతితో గడచిన యొకరాత్రి తపస్యతర్వాత వివేచనతో వ్యవస్థీకరింపఁబడిన యొకదిన తపస్య వచ్చును. దీని కార్యక్రమములు-శారీరక శిక్షణమున కవసరమగునట్లుగను, ఏవిధమైనపని నీవు చేయుదువో అందుకుఁ దగినట్లుగను, వివేకముతో తరగతులుగాఁ దీర్చఁబడి పురోగమనశీలములైన రెండభ్యాసముల నడుమ విభాగింపఁబడియుండును. ఎందుకనఁగాఁ, బైరెండును శారీరక తపస్యయొక్క భాగములుగాఁ దప్పక యేర్పడఁగలవు—ఏర్పడవలెను. అభ్యాసములఁగూర్చి చెప్పునప్పుడు, ప్రతియొకఁడును తన శరీరమున కెట్టియభ్యాసములు మేలుగ సరిపోవునో వానినతఁడే కోరుకొనవలెను. మఱియు, సాధ్యమైనచో—ఈ యభ్యాసములను వాని సంపూర్ణఫలితము కొఱకెట్లు కలుపవలెనో యెట్లు తరగతులు కట్టవలెనో ఆవిషయము బాగుగ నెఱిఁగిన సమర్థుడైన యొకరి మార్గదర్శకత్వముక్రిందఁ గోరుకొనుట మంచిది. వానిని గోరుకొనుటయందును అమలు జరుపుట యందును చపలచిత్తత్వముయొక్క అధికార ముండఁగూడదు. సులభమైనదిగా సంతోషకరమైనదిగాఁ గనఁబడుచున్నదని, యేదోయొకదానిని ఊరక చేయఁగూడదు. నీకు శిక్షణమిచ్చువాఁ డెప్పుడు మార్పుచేయు టవసరమని తలఁచు

నో అప్పుడుమాత్రమే నీ కార్యక్రమమునం దొక మార్పు చేయవచ్చును. ప్రతియొకని శరీరమునుగూర్చి: అది యెట్లు పరిపూర్ణతనందవలెను, ఎట్లు సాధారణాభివృద్ధి చెందవలె—నునది యొక తీర్మానించవలసిన సమస్యయే యగును. కాని, దాని పరిష్కారమున కెక్కువయోడ్పు పట్టుదల క్రమానుసరణము విధిగాఁ గావలెను. మానవు లెవ్వరేమనుకొన్నను, వ్యాయామశీలుని జీవితము విలాసమయజీవితముగాని ఇతరాకృష్టజీవితముగాని కాదు. ఇందుకు భిన్నముగా, మానవుఁడు తన వాంఛితార్థములను సఫలము చేసికొనుటకును, వ్యర్థములు హానికరములునైన వినోదముల కాస్పదమియ్యకుండ బ్రదుకుటకును జక్కఁగఁ గ్రమపఱుపఁబడిన యుద్యమముతోఁ గఠినములైన యభ్యాసములతో సిద్ధముచేయఁబడిన యొక యుత్తమజీవిత మది.

పనిచేయుటయందుఁగూడ నొకతపస్య గలదు. మానవుఁడే పనిచేయుచున్నను దానియం దెట్టిప్రాముఖ్యము పెట్టుకొనకుండుటయుఁ, బనిచేయుటయందే శ్రద్ధచూపుటయు నీ తపస్యయందు ముఖ్యములు. మానవుఁడు తన్నుఁదాను బరిపూర్ణపరిశుద్ధునిఁ జేసికొనఁ దలఁచినచో నతనికిఁ "జిన్నది పెద్దది, ముఖ్యమైనది అముఖ్యమైనది" అను పని యేదియును లేదు. ఆత్మాధిరాజ్యమును, అభివృద్ధిని ఎవఁడు కాంక్షించునో యతని కన్నిపనులు సమానముగా నుపయోగకరములే. ఏ

పనియందు నీ కభిరుచి కనఁబడునో ఆపనిని మాత్రమే నీవు బాగుగా చేయఁగలవని సాధారణముగా నందురు. నిజమే: కాని —కేవల మనామకముగాఁ గనఁబడు పనియే యగుగాక—ఆ పనిని 'చేయుటయందే' యెవఁడైనను అభిరుచి పొందఁగలఁ డనుట ఇంతకంటె మిక్కిలి సత్యమైనది. ఈ యభిరుచిని సంపాదించుటలో రహస్యము అతఁడు పరిపూర్ణతను సాధించు విషయమై చూపు అంతఃప్రేరణలో నిమిడియున్నది. నీవు చేయు వృత్తిగాని నీవంటుకువచ్చిన కార్యభారముగాని—అది యెట్టిదైన నగుఁగాక—దాని నభివృద్ధ్యభిముఖమైన యిచ్ఛతోఁ జేయుము. నీ వేమిచేసినను 'నా చేతనైనంత చేసెద' ననిగాక, దాని పరిపూర్ణతవైపు 'ఇంతకంటె మేలుగ—ఇంతకంటె మేలుగఁ జేసెద' నను అవిచ్ఛిన్నప్రేరణతో మనఃపూర్వకముగఁ జేయుము. ఈవిధముగా ఏ మినహాయింపు లేకుండ—కేవల కాయకష్టము మొదలు కేవల కళాత్మికము మేధాసాధ్యము అగు పనివరకు—అన్నిపనులుకూడ నభిరుచి కలిగించునవే యగును. అభివృద్ధి కవకాశ మనంతముగా నున్నది; ఎవఁడైనను ఎంతచిన్నపని నైనను మనఃపూర్వకముగాఁ జేయువాఁడు కావలెను.

ఈ పద్ధతి మనలను కర్మాచరణమునందు విమోచనము వైపు సహజముగనే నడిపించును. ఎట్లనఁగా: ఒకఁడొక పని చేయుచున్నపుడు సమస్తములైన సాంఘిక సంప్రదాయముల

నుండియు నైతిక దురభిమానములనుండియు విడివడినవాఁడు మాత్రము తప్పక కావలెను. ఇట్లనుటవలన నొకఁడు స్వేచ్ఛాయుతము నియమరహితమైన జీవితమును గడుపవలెనని కాదు. ఇందుకు భిన్నముగా, నతఁడు సాంఘికనియమము లన్నింటి కంటెఁ గఠినతమమైన యొక నియమమునకుఁ దప్పక విధేయుఁడు కావలెననియే యర్థము. ఎందుకనఁగా ఆనియమ మెట్టి కపటమును సహింపదు; సంపూర్ణమైన నిజాయతినే అది విధించును. శరీరము సరితూకముగా శక్తిమంతముగా అందముగాఁ బెరుగుటకుఁ బూర్తిగా ననువైనపద్ధతియందే శారీరక కార్యక్రమములన్నియుఁ దప్పక వ్యవస్థీకరింపఁబడవలెను. భావగతమైన యీచరమ లక్ష్యముతో నెవఁడైనను సమస్తభోగలాలసతలను — మిథున కర్మతోఁగూడ — విసర్జింపవలెను. ఎందుకనఁగా: ప్రతియొక మిథునకర్మయు మరణము వైపొక యడుగు వేయుటే యగును. అందువలననే మిక్కిలి ప్రాచీన కాలమునుండియుఁ, బరమపవిత్రమైన పరమగుప్తమైన సకల వైదికశిక్షణవ్యవస్థలయందును అమృతత్వ మాకాంక్షించు ప్రతియొకనికి నిదియొక నిషిద్ధకార్యముగాఁ జేయఁబడినది. ఈ మిథునకర్మను ఇంచుమించు చిరకాలావస్థితమగు నిశ్చేతనతా సమ్మోహము నిరంతర మనుసరించుచునే యుండును. ఆ సమ్మోహము అన్నివిధములైన దురభ్యాస ప్రాబల్యములకుఁ దలుపు తెఱచును. చైతన్యమునందొక పతనముఁ దెచ్చిపెట్టు

ను. నిజముగా నెవఁడీ యతిమానసజీవితమునకు సిద్ధము కావలెనని కోరునో యతఁడు సుఖానుభవము, విశ్రాంతి, ఉపరమము అను నెపములక్రిందఁ దన చైతన్యము దుర్వ్యయ మగుటకును నిశ్చేతనత్వమునకు దిగజారిపోవుటకు నెన్నఁడు ననుమతింపఁగూడదు. ఈ యుపరమ మనునది బలమువైపు వెలుగువైపు పోవలెఁగాని చీఁకటివైపు బలహీనతవైపు పోఁగూడదు. అందువలననే అభివృద్ధి నాకాంక్షించు నందఱికిని బ్రహ్మచర్య మొక నియమముగా నున్నది. అయినను, ముఖ్యముగా నెవరీ యతిమానస వ్యక్తీకరణమునకుఁ దమకుఁదామే సిద్ధపడవలెనని కోరుచున్నారో వారీ బ్రహ్మచర్యస్థానమునఁ బరిపూర్ణ జితేంద్రియత్వమును తప్పక స్థాపించవలెను. ఈ జితేంద్రియత్వము నిర్బంధపెట్టుటచేతను అణఁచిపెట్టుటచేతను సంపాదింపఁబడఁగూడదు. ప్రజోత్పత్తికార్యమునందు సాధారణముగా వినియోగింపఁబడు వీర్యమును అభివృద్ధికిని సంపూర్ణ పరివర్తనమునకు నుపయోగపడు ఓజస్సుగా మార్పుచేయు నొక విధమైన యాంతరిక రసవాదపద్ధతిద్వారా ఈజితేంద్రియత్వము సంపాదింపబడవలెను. పరిపూర్ణమును నిజముగా లాభకరము నయిన ఫలితము పొందుటకు సర్వవిధములైన దాంపత్య సుఖప్రేరణలను కోరికలను భౌతికేచ్ఛనుండివలెనే మానసిక ప్రాణిక చైతన్యమునుండికూడఁ దప్పక తొలఁగింపవలెనను విషయము వేఱుగాఁ జెప్పనక్కర లేదు. సమూలమును చిరస్థాయియు నగు

పరివర్తనమంతయు లోపలనుండియే వెలుపలికి నడుచుచుండును. క్రమబద్ధమైనదిగా వెలుపలఁ గనఁబడుచున్న పరివర్తన మంతః పరివర్తనముయొక్క అపరిహార్య ఫలితమనియే చెప్పవలెను.

మనమిప్పుడొక నిశ్చయమునకు రావలసియున్నది. ఏమ నఁగా: మానవజాతి యిప్పుడున్నట్లే శాశ్వతముగా ముందుకు నడచుటకై ప్రకృతియాజ్ఞకు లోఁబడి దాని యుద్దేశములకు శరీరము నప్పగింపవలెనా—లేక—ఒక క్రొత్తజాతిని సృష్టించు టకై ఒకయడుగు ముందుకు వేయునట్లు ఈ శరీరమునే సిద్ధము చేయవలెనా యను రెండింటిలో నొకదానిని నిశ్చితముగాఁ గోరుకొనవలెను. ఈరెండుమార్గములు నొకదానితో నొకటి కలిసి ముందుకు నడువవు. నిన్నటి మానవత్వములోపలనే నీ వుండఁదలఁచెదవో లేక రేపటి అతీతమానవత్వమునకుఁ జెందిన వాఁడ వగుదువో ప్రతినిమేషమునందు నీవే నిర్ధరించుకొన వలెను. ఈ జీవితము ముం దెట్లుండవలెనో అందుకుఁ దగినట్లు నిన్ను సిద్ధపఱచుకొనుటకును, ఆజీవితమున నీవొక చురుకైన సమర్థుఁడవైన వ్యక్తివగుటకును నీవు కోరినయెడల, ఈజీవిత మిప్పు డెట్లున్నదో అందుకుఁ దగినట్లు పోత పోయఁబడుటకును ఆజీవితమునందే విజయోపేతుఁడవుగ నుండుటకును నీవు తిర స్కరించి తీరవలెను. పరిపూర్ణమైన సౌందర్యమునందలి, అభిన్నభావశ్రుతియందలి జీవితసౌఖ్యమునకై నీవు హృదయ ము తెఱచియుంచఁ దలఁచినచో నీకై నీవే భోగవిలాసము

లను త్రోసివేయవలెను.

ఇది మనలను కేవల సహజముగనే ప్రాణతపస్యకును సంవేదనా తపస్యకును శక్తితపస్యకును దిసికొనిపోవును. ఈ ప్రాణమయసత్త నిజముగా వీర్యోత్సాహములను సిద్ధిపొందించు శక్తికిఁ బీఠమైనది. ఈ ప్రాణశక్తియందలి చింతన ఇచ్ఛాశక్తిగ మాఱి, కార్యవిధానమందు సక్రియగతిశీలమగును. ఈప్రాణ శక్తి—కోరికలకును రాగద్వేషాదులకును దీవ్రమైన ప్రేరణల కును బీఠమైనట్లే—తీవ్రమైన ప్రతివిధానములకును తిరుగుబాట్ల కును క్రుంగిపోవుటకును బీఠమైనదనుటగూడ నిజమే. ఇందుకు సాధారణచికిత్స దీనిగొంతు నొక్కుటయో ఇంద్రియానుభవ ము లేకుండఁజేసి ఉపవాసముంచుటయో యగును. నిజమున కీ ప్రాణశక్తి ముఖ్యముగా నింద్రియానుభవములచేతనే పోషిం పఁబడుచున్నది. ఆ యింద్రియానుభవములు లేనిచో అది నిద్ర పోవును; మొద్దువాఱును; ఇంద్రియజ్ఞానము లేనిదగును; చివరకుఁ బూర్తిగా నిర్వీస్తుక మగును.

నిజమున కీ ప్రాణశక్తి తన జీవనాధారములను మూడు మూలోపాధులనుండి తీసికొనును. ఈ ప్రాణశక్తికి మిగుల సులభముగా నందుబాటులోనుండి, యధోభాగమునుండి వచ్చు మొదటిజీవనాధార మేదనఁగా ఇంద్రియానుభవముల ద్వారావచ్చు భౌతికశక్తులే. ఇఁక రెండవ జీవనాధారము: ఈప్రాణశక్తి చాలినంత వైశాల్యము, గ్రహణశక్తిగలదై విశ్వ

మయ ప్రాణశక్తులతో సంబంధము కలిగియున్నయెడల ఈ రెండవ జీవనాధారము దాని స్వీయకక్ష్యయందే యున్నది. ఇఁక మూడవజీవనాధారము: పురోభివృద్ధికిఁ దీవ్రమైన యాకాంక్ష కలిగినప్పుడుమాత్రమే సాధారణముగా నిది తెలియఁబడును. ఆధ్యాత్మికశక్తులను, అనుప్రేరణలను మనసునకు పట్టించుకొనుటద్వారా లోపలి కాస్వాదించుటద్వారా ఈ మూడవజీవనాధార మూర్ధ్వభాగమునుండి వచ్చును.

ఈమూడింటికిఁ దోడుగా మఱియొక యాధారమును జతపఱచుటకై మానవు లెల్లప్పుడును ఎక్కువగనో తక్కువగనో ప్రయత్నము చేయుచుందురు. అట్టుచేయునప్పుడే వారికిది యనేకములైన బాధలకును దుర్దశలకును మూలాధార మగుచున్నది. ప్రాణశక్తులు తోడిప్రాణశక్తులతో గలియు–సాధారణముగా నిద్దరిద్దరుగా జంటయగు–పరస్పరాదాన ప్రదాన లీలయే ఈనాల్గవ యాధారము. దీనినే వారు ప్రేమయని పొరపడుచున్నారు. కాని యీ పరస్పరాదానప్రదాన లీలయందు ఉత్సాహముపొందు రెండుశక్తుల నడుమనేర్పడిన కేవలాకర్షణ మాత్రమే యిది.

అందువలన, 'మన ప్రాణశక్తి నిరాహారత పొందఁగూడ'దని మనము కోరినచో నింద్రియానుభవములను దిరస్కరింపఁగూడదు; వానిసంఖ్యను తగ్గింపనుగూడదు; లేక, వానితీవ్రతను మొద్దుపఱుపను గూడదు; వానిని తప్పించుకొని పోవుటయు

గూడదు. మఱి వానిని తారతమ్య వివేచనముచేతను విచక్షణచేతను దప్పక యుపయోగించుకొనవలెను. ఇంద్రియానుభవములు విద్యకు జ్ఞానమునకు శ్రేష్ఠములైన సాధనములు. ఈ ప్రయోజనము సాధించువానినిగా వానిని జేయునప్పుడు భోగవిలాసములకొఱకు ఆత్మతృప్తికొఱకు నంధప్రాయముగా నమాయికముగా వెదుకుటయం దివి యొకసుఖసాధనములుగా ఒకానొక యహమాత్మిక ప్రయోజనముకొఱకుపయోగింపఁబడఁగూడదు.

ఇంద్రియములు విసుగు అశాంతియు లేకుండ దేనినైనను భరించుటకు సమర్థములుగా నుండవలెను. అంతేగాక, అప్పుడే యవి వివిధములైన ప్రాణశక్తి ప్రకంపనములయొక్క గుణమును గూర్చియు ఉత్పత్తినిగూర్చియు ఫలితమునుగూర్చియు తారతమ్య వివేచనముచేయుశక్తిని ఒకసారికంటె మఱొకసారి యెక్కువగాఁ దప్పక సంపాదింపవలెను—వృద్ధిచేసికోవలెను. మఱియు—నట్లే ఆయింద్రియములు తాము "అన్నమయ ప్రాణమయ సత్తయొక్క ఏకశ్రుతిక సమ్మేళనమునకును సౌందర్యమునకును చక్కని యారోగ్యమునకును అనుకూలముగ నున్నామా", లేక "వాని సమస్థితికి నభివృద్ధికి భంగకరముగ నున్నామా"—యని తప్పక తెలిసికోవలెను. ఇంతకంటెఁ గూడ ఈయింద్రియములు అన్నమయ ప్రాణమయ ప్రపంచముయొక్క సర్వవిధములైన చిక్కులను సమీపించుటకును బరిశీ

లించుటకును దగిన సాధనములుగాఁ దప్పక యుపయోగింపఁ బడవలెను. ఈ విధముగాఁ బరివర్తనమునుగూర్చిన యీగొప్ప ప్రయత్నమునం దింద్రియములు తమ నిజమైనస్థానము నవి పొందఁగలవు.

ఎవఁడైనను ప్రాణశక్తిని బలహీనపఱచుటచేతఁ గాక, దానిని వివేకవంతము చేయుటచేతను బలపఱచుటచేతను పరిశుద్ధము చేయుటచేతనే వ్యక్తిసత్తయొక్క నిజమైన అభివృద్ధి వైపు సహాయపడఁగలఁడు. ఒకఁడు తనకుఁదానే యింద్రియానుభవములను దూరముచేయుట తన యాహారమును దానే దూరముచేయుటవలె హానికరమైనది. ఈవిధముగా-ఆహారపు టెన్నిక పండినజ్ఞానముచేతను, శరీరము చక్కఁగఁ బెరిగి దాని పనుల నది చక్కఁగఁజేయవలెనను ఉద్దేశముచేతను మాత్రమే చేయఁబడుచున్నట్లే—యింద్రియానుభవముల యెన్నికకూడఁ గ్రియాశక్తిరూపకమైన యీయుత్తమ సాధనముయొక్క పెరుగుదలను బరిపూర్ణతను లక్షించిన యుద్దేశముచేతనే తప్పక చేయఁబడవలెను; వానిపైనియామకత్వముకూడ సంపాదింపఁబడవలెను. ఎందుకనఁగా: సత్తయొక్కయభివృద్ధికి దాని యితరభాగములన్నింటివలెనే యీ సాధనముకూడ ముఖ్యావసరమైనది.

ప్రాణశక్తిని విజ్ఞానవంతము చేయుటచేతను, దానిని మునుపటికంటెఁ బరిశుద్ధమైనదానినిగను — మునుపటికంటె చురుకైనదానినిగను,—మునుపటికంటె సూక్ష్మమైనదానిని

గను—మనోజ్ఞమైనదని యాపదముయొక్క సంపూర్ణార్థముతో నెవఁడైనఁ జెప్పఁదగినదానినిగను జేయుటచేతనే సాధారణముగా మోటుదనము అజ్ఞానము అభిరుచి శూన్యత యను వానియొక్క వ్యాపారములగు ఆ ప్రాణశక్తియొక్క దౌర్జన్యములను క్రౌర్యములను ఎవ్వడైన నధిగమించి పోఁగలఁడు.

యథార్థస్థితియందు, ఏశిక్షణము లేక స్వేచ్ఛగా విడుచుటతో—ఇప్పుడున్నట్లు అనర్గళముగా అసభ్యము అహంభావయుతము విపరీతక్రమమైన ప్రాణశక్తి యెపుడు శిక్షితమై ప్రకాశవంతమైనదగునో, అప్పుడు ఉదాత్తమైనదిగను వీరోచితమైనదిగను స్వార్థరహితమైనదిగను ఉండఁగలదు. భోగముల కొఱకుఁ దారాడుచున్న యీప్రాణశక్తిని ఆధ్యాత్మిక పరిపూర్ణతాభిముఖమైన యాకాంక్షలోనికిఁ దనకుఁదానే యెట్లు పరివర్తనము చేయవలెనో యా విధమును ప్రతియొకఁడు తెలిసికొన్నచో అదియే చాలును. ఎందుకనఁగా: ఈ ప్రాణశక్తియొక్క శిక్షణము చాలినంత దీర్ఘముగఁ బట్టుదలతో నిజాయతితో విడువక యెప్పు డనుసరింపఁబడునో, అప్పుడు ఈ లక్ష్యముయొక్క గొప్పతనమును సౌందర్యమును విశ్వసించునట్టియు, దివ్యానందము సాధించుటకొఱకై యల్పములైన భ్రాంతిమూలకములైన యింద్రియ సంతర్పణముల నన్నింటిని విడిచిపెట్టునట్టి యొక యుత్తమ ముహూర్తము వచ్చును.



# 2

మౌనము మానసిక తపస్యనుగూర్చి మాటలాడునపుడు వెంటనే ఒక విషయము స్ఫురణకువచ్చును. అది సుచిర ధ్యానపరత్వము. అది చింతనను నియమించుటకు దారిచూపి, చివరిఫలితముగా ఆంతరిక నిశ్చలనీరవతను ప్రతిష్ఠించును. యోగుల శిక్షణాభ్యాసమునకుఁ జెందిన యీయంశ మందఱికి బాగుగఁ దెలిసినదేగనుక దీనిపై దీర్ఘమైన వివరణమున కవసర ముండదు. అయినను, జనులకు సాధారణముగాఁ దక్కువ పరిచయముగల మఱియొక యంశముగలదు. అది వాఙ్నియమము. ఏకొద్ది మినహాయింపులో తప్ప, ఈ వాఙ్నియమము కళ్లెములేని వదరుబోతుతనమునకుఁ బ్రతిపక్షముగాఁ గేవల నిశ్శబ్ద నీరవతగానుండును. ఏమైనను, మాటలాడుటను బూర్తిగ నిషేధించుటకంటె దానినొక కొలతలో నియమించుట చాల శ్రేష్ఠతరమైనదియు మిక్కిలి ఫలవత్తరమైన తపస్య.

ఈ భూమియందు ధ్వనులను స్పష్టముగా నుచ్చరింప సమర్థములైన జంతువులలో మానవుఁడు ప్రథముఁడు. ఇందుకతఁడు నిజముగా గర్వించుచున్నాఁడు; కొలతయుఁ దారతమ్యజ్ఞానము లేకుండ నతఁ డీశక్తి నమలుపఱచుచున్నాఁడు; ఆతని సంభాషణల కలకలముతో నీప్రపంచము బధిర మగుచున్నది.

ఆ కలకలముచేతనే కొన్నివేళలలో ఈ వృక్షసామ్రాజ్యము నందలి యేకశ్రుతిక నిశ్చలనీరవత్వమును నీ వందుకో లేనట్లు కనఁబడుచున్నావు.

ఇంతేగాక, మానసికశక్తి తక్కువైనపుడు మాటలాడు నవసర మంత యెక్కువగా నుండుననుట బాగుగఁదెలిసిన విషయము. ఇందు కుదాహరణముగా: మాటలాడకున్నచో ఆలోచనయే పొఅని ఆదిమజాతులు విద్యావిహీనులైన జనులు కొంద ఱున్నారు. వారు ఇంచుమించు హీనస్వరముతోఁ బద ములను గొణుగుకొనుటను నీవు వినఁగలవు. ఎందుకనఁగా: చింతనారథము ముందుకు సాగుటకా సాధన మొకటియే వారి కున్నది. పదము నుచ్చరింపకున్నచో వారిలో నాలోచ నయే రూపొందదు.

బహుళ సంఖ్యాకులైన జనులును విద్యావంతులలోఁ గూడ బలహీన మనశ్శక్తిగలవారును తాము మాటలాడు ధోరణియందుఁదప్ప ఏమి మాటలాడవలయునో ముందుగాఁ దెలియనివారు కొంద ఱున్నారు. అదియే వారసంభాషణమును ముగియని దానినిఁగా విసుగు పుట్టించుదానినిగాఁ జేయును. అయినను, వారు మాటలాడుచుండఁగా వారి యాలోచనలు క్రమక్రమముగా స్పష్టమైనవిగా సూటియైనవిగాఁ దేరుకొను చుండును. ఈ యభ్యాసమే వారిని చెప్పినంతకంటె నింకను సూటిగాఁ జెప్పుటకై చెప్పినదానినే మాటిమాటికిఁ జెప్పుటకు

నిర్బంధించుచున్నది. మఱికొందఱు తామేమి చెప్పవలసి యున్నదో దానిని చెప్పుటకుముందే సిద్ధముచేసికోవలసిన యవసరముగలవా రున్నారు. వారు చెప్పఁదలఁచిన దానికి సూటియైన పదములను ఒకదానివెంట నొకదానిని గూర్చు కొనుటకుఁ దగిన వ్యవధి దొరకనప్పుడు, తక్షణమే హఠాత్తుగా మాట్లాడవలసివచ్చినచో వారు తడఁబడుదురు.

చివరగా, సహజ వాగ్ములైనవారు కొంద ఱున్నారు. వారు వక్తృత్వమునం దారితేరినవారు. వా రేమిచెప్పఁ దలం తురో అందు కవసరమైన పదముల నప్రయత్నముగనే వారు గుర్తింతురు. దానినిఁ జక్కఁగాఁ జెప్పెదరు.

ఏమైనను, మానసిక తపస్యాదృక్పథమునుండి చూచిన చో నీచెప్పిన దంతయు వదరుఁబోతుతనపుఁదరగతికి వెలుపలఁ బడునదికాదు. కేవలాపరిహార్యముగా నుచ్చరింపవలసిన పద మునుదప్ప నేపదము నుచ్చరించినను అది వదరుఁబోతుతనమని నాభావము. దానినెట్లు నిర్ణయించెదవని యెవ్వరైన నడుగవ చ్చును. అందుకొఱకు బహిరుచ్చరితములైన పదములన్నింటికిని నొక సాధారణపద్ధతిలో మనము తరగతుల నేర్పఱుపవలెను.

మొదటిది: ఈస్థూల జగద్రాజ్యమునం దేదోయొక ప్రయోజనముకొఱకు ఉచ్చరింపఁబడు పదముల నన్నింటిని మనము వినుచున్నాము. ఆ పదములు అత్యంతము బహుళ సంఖ్యాకములు; సాధారణ జీవితమునందు మిక్కిలి యలవాటు

గా చాల నుపయుక్తములైనవి.

పదముల యెడ తెగని సవ్వడి మామూలు దినచర్యకుఁ ద్రోసివేయరాని సహచరముగా నుండవలసినట్లు కనఁబడు చున్నది. అయినను, ఈ సవ్వడిని సాధ్యమైనంత తక్కువ కొలతకు తగ్గించుటకు నీవు ప్రయత్నించినచో, మౌనమునందే యనేక కార్యములు ఇంతకంటె మేలుగ శీఘ్రముగఁ జేయఁబడు ననియు, ఈమౌన మంతఃప్రశాంతిని ఏకాగ్రతను నిలుపుకొను టకు సహాయపడుననియు నీవు కనుఁగొన మొదలుపెట్టుదువు.

నీవు ఒంటరివిగాఁగాక యితరులతోఁ గలిసి నివసించు చున్నచో, నిరంతరము మాటలద్వారా నిన్నునీవే బయలు పఱచుకొనకుండునట్టి యభ్యాసము నలవఱచుకొనుము. అప్పు డు నీకును ఇతరులకును నడుమ నొకరినొకరు అర్థముచేసికొను నేదోయొక యాంతరికబంధము నెలకొల్పఁబడినదని క్రమము గాఁ దెలిసికొనఁగలవు. అప్పుడు మీరు పరిమితపదముల తోనో పదములు లేకుండఁగనో యొకరికొకరు వార్త లందించు కొనుటకు సమర్థు లగుదురు. ఈ బాహ్యమౌన మంతఃప్రశాం తికి మిక్కిలి యనుకూలమైనది. నీకు దృఢసంకల్పము— ఎడతెగని యాకాంక్షయు నున్నచో నభివృద్ధి కనుకూలమైన వాతావరణమును నీవు సృష్టించుకొనఁగలవు.

ఇతరులతోఁగూడిన యొక సమష్టిజీవితమునందు జీవితో పాయమునకుఁ బ్రాపంచికవృత్తులకు సంబంధించిన పదముల

తోఁబాటు ఇంద్రియస్పందనములను భావస్ఫురణలను భావావేశములను వెల్లడించు పదములనుగూడఁ దప్పక చేర్చవలెను. ఈసందర్భమున బాహ్యమైన మౌనవ్రతము ననుష్ఠించు నలవాటు అమూల్యమైన సహాయముగా నుండును. ఎందుకనఁగా: ఇంద్రియస్పందనముల యొక్కయు భావస్ఫురణములయొక్కయుఁ దరంగములు నీపైఁ బడినపుడు మౌనవ్రతము ననుష్ఠించు ఈ యలవాటు ఆ యింద్రియస్పందనములను భావస్ఫురణలను మాటలలోనికిఁ ద్రోయుటకుముందే వానిని ఆలోచించుకొనుటకును, అవసరమైనచో వెనుకకు మరలించుకొనుటకును తగినయవకాశము నిచ్చును. ఈపద్ధతితో నెన్నియో కలహములు నివారింపఁబడఁగలవు. పలుమారు వాగ్వ్యభిచార ఫలితములుగా సంభవించు మనస్తాత్త్విక విషాద సంఘటనలలో నే యొకదానినుండియైన నీవు పెక్కుమారులు రక్షింపఁబడుదువు.

ఒకవేళ నీవు అటువంటి అత్యల్పణస్థితికిఁ బోకున్నను, నీ వుచ్చరించుమాటల నెల్లప్పుడు నియమితముచేసి, హఠాత్తుగా బ్రద్దలుచేసికొనివచ్చు కోపముచేతను క్రౌర్యముచేతను భావోద్రేకముచేతను నీ నాలుక కదలునట్లు జారవిడువఁగూడదు. ఇట్లు మాట్లాడుట దుష్ఫలితములఁ గలిగించు కేవలమొక జగడముచేయుట మాత్రముగాదు—నిజమున కిది వాతావరణమునందు దుష్టభావతరంగములను వ్యాపింపఁజేయుటకై నీ నాలుక నుపయోగించుటే యగును. ఎందుకనఁగా శబ్దతరంగ

ములకంటె నధికముగా వ్యాపనశీలమైనది మఱియొకటిలేదు. ఆభావావేశవ్యాపారములు తమకుఁదామే వెల్లడియగుట కవకాశ మిచ్చుటచేత వానిని నీయందును ఇతరులయందును నీవే శాశ్వతీకరించుచున్నావు.

ఒకడు ఇతరులనుగూర్చి చెప్పునదంతయు అత్యంతావాంఛనీయములైన వదరుఁబోతుతనములలో నొకటిగాఁ బరిగణింపఁబడవలెను.

నీవు కొందఱువ్యక్తులకు సంరక్షకుఁడవుగానో ఉపాధ్యాయుడవుగానో లేక ఆయా అధికారవ్యవస్థలకు ముఖ్యాధికారివిగానో జవాబుదారీ వహించినవాఁడవుగా నున్నప్పుడుతప్ప, ఇతరులేమిచేసినను చేయకున్నను దానితోనీకు సంబంధము లేనే లేదు. వారిపైఁగాని, వారుచేయు పనిపైఁగాని, లేక వారిని గుఱించి యితరు లేమనుకొనెదరో యేమిచెప్పెదరో దానిని గూర్చిగాని నీ యభిప్రాయ మిచ్చుటకును—వారినిగూర్చి మాటలాడుటకును నిన్నునీవు హద్దులో నుంచుకొనవలెను.

ఒకానొక ప్రత్యేకసంస్థయందుఁగాని, నీవు చేయుచున్న వ్యాపారమునందుఁగాని లేక ఒక ఉమ్మడికార్యమునందుఁగాని యేమి జరిగినదో ఆ వివరములు తెలియఁజేయుట నీ విధిగా నీవృత్తియొక్కస్వభావమే నిన్ను నియమింపవచ్చును. ఆసందర్భమున నీ నివేదిక ఆ కార్యమునకు సంబంధించిన దానినిమాత్రమే చెప్పునదిగా నుండవలెను; వ్యక్తిగతములైన

విషయముల నందు తడవఁగూడదు. ఎట్లుచూచినను దానిలో నేమాత్రము సంబంధము లేని మూడవవ్యక్తిగా నీ వుండవలె ను. వ్యక్తిగతమైన యే ప్రతిక్రియగాని యేప్రాముఖ్యముగాని యేసానుభూతిగాని యేప్రతికూలతగాని యందులోఁజేరుట కనుమతింపనేగూడదు. ప్రత్యేకముగా నీవంతు కియ్యఁబడిన పనియందు నీచమైన నీవ్యక్తిగ తాసూయను కలుపనేకూడదు.

ఏ సందర్భమునందైనను సాధారణముగా నితరులను గూర్చి ఒకఁడెంత తక్కువగా మాటలాడునో — అది వారిని గూర్చిన స్తోత్రమేయగుఁగాక—అదియే మంచిది. తనలో నేమిజరుగుచున్నదో దాని నున్నదున్నట్లుగాఁ దెలిసికొనుట తనకే మిక్కిలి కష్టమైనదనుట సుప్రసిద్ధము. ఇట్లుండఁగా, నితరులయం దేమి జరుగుచున్నదో దానిని యథార్థముగాఁ దెలిసికొను టెట్లు? కనుక నేవ్యక్తినిగుఱించిగాని మార్చుటకు వీలుగాని తీర్పులలో నేయొకదానినైనను—అది ద్వేషము గాకున్నను బుద్ధిమాంద్యమే యగుఁగాక — ఉచ్చరించుట మానుకొమ్ము.

ఎప్పుడు నీచింతన వాక్కులయందు వెల్లడింపఁబడునో అప్పుడే యందలి శబ్దతరంగములు కేవల భౌతికపదార్థమును చింతనతో సంబద్ధముచేయుటకును, ఆవిధముగా దానికి ఘనీభ వించిన ఫలప్రదమైన సత్యత్వమిచ్చుటకును విశేషశక్తికలవిగా నుండును. అందువలననే వస్తువులఁగూర్చిగాని వ్యక్తులఁగూర్చి

గాని చెడ్డ పలుకఁగూడదు. మఱియు, నీభూమియందు దివ్య త్వోపలబ్ధియొక్క యభివృద్ధికి భంగకరమైనదానిని మాటల లోఁ జెప్పఁగూడదు. ఇది కేవల సాధారణమైన నియమము. కాని, దీనికొక మినహాయింపు గలదు. నీవు వేనినైన విమ ర్శించునప్పు డా విమర్శనీయములైన వస్తువులఁగాని ఉద్యమ ములఁగాని రూపుమార్చుటకో నివారించుటకో తగిన చైతన్య శక్తియుఁ గ్రియాత్మకేచ్ఛయు నీయందు లేనిచో నీవు దేనినిఁగాని విమర్శింపఁగూడదు. నిజమునకు, ఈచైతన్యశక్తియుఁ గ్రియాత్మ కేచ్ఛయు ఈదుష్టతరంగములను దిరస్కరించుటకును, వానికిఁ బ్రతిక్రియ చేయుటకును, చిట్టచివరకు ఈ తరంగములు భౌతిక మైన యంతస్తునందుఁ దమకుఁదామే వ్యక్తముకాకుండ నివా రించునట్లు సరిదిద్దుటకును దగిన సాధ్యతను—భౌతికపదార్థముల లోనికి నిండించుశక్తిని పొందియున్నవి.

ఎవఁ డాధ్యాత్మికరాజ్యమున సంచరించునో, ఎవఁడు తన మనశ్శక్తులయం దాత్మజ్యోతిని సత్యబలమును బ్రసరింపఁ జేయునో యతఁడుమాత్రమే అపాయములేకుండ అపాయ భయశంకలేకుండ ఈపని చేయఁగలఁడు. అతఁడెట్టి ప్రాముఖ్య మునకు నేరాగబంధమునకుఁ గట్టువడని యాధ్యాత్మిక సాధ కుఁడు. తనయందుఁ దనకుఁదానే యహంతాపరిధులను దెగఁ గొట్టినవాఁ డతఁడు. అతఁడనఁగా—ఈభూమియందు అతి మానసికానుష్ఠానము కొఱకు సంపూర్ణముగాఁ బరిశుద్ధమైన

అద్వైయ త్తికసాధనముకంటె మఱేమియుఁగాదు.

మన భావములను అభిప్రాయములను, మన పర్యాలో చన యొక్కయు సమ్యగ్విద్యాభ్యాసముయొక్కయు ఫలితములను వెల్లడించుటకై యుచ్చరింపఁబడు పదములుకూడఁ గొక్కులున్నవి. "మన మిచ్చట మేధాపరిపూర్ణమైన రాజ్యమున నున్నాము; ఈప్రాంతమునందలి మానవులు మిక్కిలి సహేతుకప్రవృత్తి గలవారు; సమతోలనస్థితి కలవారు; కనుక ఈకఠిన తపస్యాభ్యాస మెక్కువ యావశ్యకమైనది కా" దని మనము తలంపవచ్చును. కాని, ఇది యటువంటిదేమియుఁ గాదు. ఎందుకనఁగా: మానవు లిచ్చటఁగూడ నీభావవిజ్ఞాన భవనములోనికిఁ దమతమ దృఢవిశ్వాసముల క్రౌర్యమును, మతప్రయుక్తమైన యసహనమును, ప్రాముఖ్యమునుగూర్చిన రాగావేశమును బ్రవేశపెట్టియున్నారు. ఇచ్చటఁగూడ మానసికతపస్య నవలంబించుట కట్టి యవసర మేయున్నది. మఱియు, కఠినమైనట్టియు ఇంచుమించుగా నెల్లప్పుడును వ్యర్థమైన వివాదములకు దారితీయునట్టి పరస్పరభావ పరివర్తనమును జాగ్రత్తగాఁ దప్పించుకొనవలసియున్నది. మనస్సంకుచితత్వమువలన నేర్పడి, తీవ్రచర్చలతోఁ—గడకుఁ గలహములతో ముగియు నభిప్రాయప్రాతికూల్యము నంతటినిఁగూడఁ దప్పించుకొనవలసి యున్నది. ఇదంతయు మానవుఁ డత్యున్నతమైన మానసిక రాజ్యము నధిరోహించినప్పుడే చులకనగా నివారింపఁ

బడఁగలదు.

నిజమునకు, మానవుఁ డెవఁడైనను నిర్దిష్టరూపము పొందిన యీచింతన యంతయు 'ననిర్వాచ్యమైన దేనినో యొక దానిని జెప్ప నొకమార్గమే' యని తెలిసికొన్నపుడు మతాభిమాన వివాదము వచ్చు నవకాశమేయుండదు. ప్రతియొక భావమునందును సత్యముయొక్క యల్పాంశముగాని, లేక సత్యముయొక్క యొక దృక్పథముగాని యిమిడియుండును. కాని, కేవల సత్యమేయయిన భావమేదియు లేనేలేదు.

వస్తువుల పరస్పర బాంధవజ్ఞానము ఒకనియొక్క సమత్వమును గాపాడుటకును, ఒకని సంభాషణమునందు ములు ప్రొుగ్గని తూకమును నిలువఁబెట్టుకొనుటకును శక్తిమంతమైన సహాయముగానుండును. కొంత విజ్ఞానముకలవాఁడును వృద్ధుఁడునైన యొకానొక గుప్తవిద్యావిధిజ్ఞుఁ డొకానొకప్పుడిట్లు చెప్పుచుండఁగా వింటిని — "అంతయుఁ జెడ్డదైన దేదియు లేదు. కొన్నివస్తువులు కలవుగాని అవి వానివాని స్థానమున లేవు. ప్రతివస్తువును దాని కుచితమైన స్థానమున నుంచుము. అప్పుడు పరస్పర సమ్మేళనము గల యొక ప్రపంచమును చూడఁగలవు."

ఎట్లైనను, క్రియాత్మక దృక్పథమునుండి చూచినచో ఒక భావముయొక్క విలువ అది యుపయోగపడఁగల శక్తి ననుసరించియుండును. ఈశక్తి యెవరియందుఁ బనిచేయుచున్న

దో ఆప్రత్యేకవ్యక్తుల ననుసరించి యది వేర్వేరుగా మారు చుండుననుట నిజము. ఒకనియం దొకప్రత్యేకభావము ముం దుకు నడుపుశక్తిని గొప్పగాఁ గనఁబఱచినను, ఆభావమే మఱి యొకవ్యక్తియందుఁ బూర్తిగా నిష్ఫలమగును. కాని, యా శక్తిమాత్రము తనకుఁదానే వ్యాపనశీలమైనది. కొన్నిభావము లీ ప్రపంచమునే మార్పుచెందించు శక్తికలవిగా నున్నవి. అవియే తప్పక వెల్లడించవలసినవి. ఆధ్యాత్మికాకాశమునం దవి ధ్రువతారల వంటివి. ఈభూమిని పరమసాక్షాత్కారము వైపు ముందుకు నడుపుచున్నవిగూడ నివియే.

చివరియంశముగా: బోధనముకొఱ కుపయోగింపఁబడు చున్న పదజాల మెంతయోగలదు. ఈతరగతిపదములు బాలక శిక్షణము మొదలు విశ్వకళాపరిషద్విద్యా శిక్షణము వరకును —మానవజాతికి సంబంధించిన కళాత్మిక వాఙ్మయాత్మిక నిర్మాణము లన్నింటిలో దేనిని విడువకుండ — ఉల్లాసపఱచు నవిగను ఉపదేశమిచ్చునవిగను వ్యాపించియున్నవి. ఈమండ లమునందలి పదములన్నియు మనము దేనిని సాధించెదమో దాని విలువనుబట్టి ప్రయోగింపఁబడుచుండును. కాని,ఆవిషయ మిచ్చుట వివరించుటకుఁ జాల విస్తారమైనది. అయినప్పటికి, ఇంతమాత్రము నిజము: ఈరోజులలో విద్యకొఱకైన శ్రద్ధ మిక్కిలిగాఁ జూపఁబడుచున్నది. నూతనముగాఁ గనుఁగొనఁ బడిన వైజ్ఞానిక రహస్యముల నుపయోగించుకొనుటకును,

విద్యాశిక్షణస్థానమున వాని నుంచుటకును ప్రశంసాపాత్రము లైన ప్రయత్నములు చేయబడుచున్నవి. అయినను, ఈవిష యమునందుఁగూడ సత్యాకాంక్షియగువానికిఁ దపస్యావస రము గలదు.

బాలురకేగాక వయసు వచ్చినవారికిఁగూడ విద్యాభ్యాస పరిశ్రమయందలి బరువు తగ్గించుటకును, విద్యాభ్యాసము నందు సౌలభ్యము కలుగుటకును విద్యాప్రణాళికయం దేదో యొకవిధముగాఁ దేలికయైనట్టియు, ఉల్లాసపఱచునట్టియు, కడకు అల్పాభిరుచి ప్రేరకములైనట్టి నిర్మాణములు తప్పక చేర్చఁబడ వలెనను విషయము సాధారణముగా నందఱకుఁ దెలిసియే యున్నది. ఒకానొక దృక్పథమునుండి యది నిజమే. అయి నను, దురదృష్టవశముగా నీయంగీకారము మానవస్వభావము నందలి అసభ్యత, క్రౌర్యము, నైచ్యము మొదలగువానిని వికసింపఁ జేయుటకంటె వేఱుగాని అన్నిరకములైన సరకులను దిగుమతిచేయుటకే, యొక సేవావ్యాజముగ మాత్రమే పని చేసినది. ఈ యంగీకారమునందు మిగుల తుచ్ఛములైన ప్రేరణలును మిక్కిలి నీచములైన యభిరుచులును అపరిహా ర్యావసరములుగాఁ దమ్ముఁ దామే స్థిరపఱచుకొనుటకును ప్రదర్శించుకొనుటకును జక్కని నెపమును కనుగొన్నవి. ఇది యిట్లుండఁగూడదు: ఒకఁడు తనకుఁ దానుగా సడలి యించుక విశ్రాంతిపొందవచ్చునుగాని, దుష్ప్రవృత్తిగలవాఁడుగా నుండ

నక్కఱలేదు. ఒకఁడు హాయిగానుండవచ్చునుగాని, యసభ్యుఁడుగా నుండనక్కఱలేదు. ఒకఁడు తనకుఁదానే బిగువు తప్పవచ్చునుగాని, తన స్వభావములోని నీచభావములు పైకి వచ్చుట కాస్పదమీయనక్కఱలేదు. అయినను, తపస్యా దృక్పథమునుండి యీ యవసరములు తమకుఁదామే తమ స్వభావమును మార్చుకొనును. ఈ విశ్రాంతిపొందుట యనునది ఆంతర నిశ్శబ్దనీరవతలోనికిని, హాయియనునది నిదిధ్యాసలోనికిని, బిగువు తప్పుటయనునది నిర్వృతిలోనికిని బరివర్తనము చెందును.

సర్వసాధారణముగా నంగీకరింపఁబడినదగు ఈవినోదించు నవసరము, ప్రయత్నమును సడలించు నవసరము, జీవిత లక్ష్యమునే యించుమించు పూర్తిగా దీర్ఘముగా మరచిపోవు నవసరము, జన్మ ముఖ్యహేతువునే మరచిపోవు నవసరము మిక్కిలి సహజమైనదనియు త్రోసివేయరానిదనియు భావింపరాదు. మరేమనఁగా, ఇది ఆకాంక్షాతీవ్రత లేకపోవుటవలన నొకదానికి లొంగిపోవు బలహీనతయనియు, అజ్ఞాన అచేతనత్వ అశ్రద్ధలవలన నేర్పడిన ఇచ్ఛయొక్క యస్థిరత్వమనియు భావింపవలెను. ఈ వ్యాపారములను నీవు సమర్థింప వలదు. అవి అవసరములైనవి కావని త్వరగానే నీవు తెలిసికొందువు. కొంతకాలమున కవి నీకు అసహ్యములైనవి, అంగీకరింపఁదగనివికూడఁ గాఁగలవు. అప్పుడు మానవసృష్టులలో అత్య

ధిక భాగములు పైకి కుల్లాసపఱచునవిగాఁ గనఁబడినను, నిజమున కధోగతికిఁ దీసికొనిపోవునవై, అవి తమ సహాయమును బ్రోత్సాహమును బోఁగొట్టుకొనును.

ఎట్లైనను, ఉచ్చరింపఁబడిన పదముయొక్క విలువ సంభాషణానుగత విషయముయొక్క స్వభావముపై నాధారపడియుండునని యెవ్వరును నమ్మరాదు. ఒకఁ డితరవిషయములపై నెంత బాగుగ మాట్లాడునో అట్లే ఆధ్యాత్మికవిషయములపైఁ గూడ మాటలాడి వేయవచ్చును. కాని, యిట్టి వదరుఁబోతుతనము ప్రమాదకరమైనవానిలో నొకటి కావచ్చును. ఉదాహరణమునకు: ఒక క్రొత్తసాధకుఁడు తాను నేర్చుకొన్న కొంచెము నితరులకుఁ బాలుపంచుటకు నెల్లప్పుడు నాతురపడుచుండును. కాని, అతఁడా సాధనయం దభివృద్ధి పొందుకొలఁదిని తనకెక్కువ తెలియదనియు, ఇతరులకు బోధింపఁ బ్రయత్నించుటకుముందే తనజ్ఞాన మింతటిదని తనకుఁ దప్పక విశ్వాసము కలిగియుండవలెననియుఁ గ్రమక్రమముగా నధికముగా గుర్తించును. కడపట నతఁడు వివేకవంతుడై, 'కొన్ని నిమేషములపాటుపయోగకరముగా మాటలాడ సమర్థుఁడగుట కెన్నోగంటలకాలము నిశ్చలనీరవైకాగ్రధ్యాన మవసర' మని చివరిగా నతఁడు తెల్సుకొనును. ఇదియునుగాక, ఆంతరిక జీవితమునకు నాధ్యాత్మిక ప్రయత్నమునకును సంబంధించిన విషయమున వాక్ప్రయోగమును మఱింత కఠినమైన

నియమమునం దుంచవలెను. మాటలాడవలసిన అత్యవసర పరిస్థితియందుఁ దప్ప దేనినిగూర్చియైన మాటలాడ నేగూడదు.

తన అభివృద్ధిని త్వరితపఱచుటకై యుద్దేశింపఁబడినదై, ఒక యనుభవముతోఁ గూడఁబెట్టఁబడిన తనశక్తి యంతయు నొక క్షణములో నదృశ్యమైపోవుట కెవ్వఁ డిష్టపడఁడో అట్టివాఁడు తన ఆధ్యాత్మికానుభవములఁగూర్చి యేమియు మాటలాడఁ గూడదనుట అందఱు బాగుగ నెఱిఁగిన విషయము. ఈ నియమమున కొక పేరుయొక మినహాయింపు గలదు. అది అతని గురువునకు సంబంధించినది. ఒకఁడు తన యనుభవములోని విషయముఁగూర్చి దాని యర్థమునుగూర్చి యేవైన వివరణములనుగాని యుపదేశములనుగాని గురువునుండి పొందఁ దలఁచినప్పుడుమాత్రమే మాటలాడవచ్చును. నిజమునకు గురువుదగ్గర మాత్రమే యతఁ డీ విషయములనుగుఱించి అపాయము లేకుండ మాటలాడఁగలడు. ఎందుకనఁగా: గురువొక్కఁడుమాత్రమే తన విజ్ఞానముతో నీ మేలుకొఱకు నీ యనుభవములయొక్క మూల తత్త్వములను నూతనాధిరోహణమునకు సోపానములుగా మార్చుటకు సమర్థుఁడు.

గురువుకూడ వ్యక్తిగతముగా నతనికి సంబంధించిన వానిని గూర్చినంతవరకు నీ మౌన నియమమునకు లోఁబడి యున్నాఁడనుటయు సత్యమే. ప్రకృతియందుఁ బ్రతియొక్కటియు గతిశీలముగా నున్నది. ఏది ముందుకు నడువదో అది

వెనుకకు జరుగక తప్పదు. గురువుయొక్క యభివృద్ధి శిష్యునితో సమాన కక్ష్యలో నుండకపోయినను, శిష్యునివలెనే గురువు కూడ నభివృద్ధి పొందవలసియున్నది. అతఁడుకూడఁ దన యనుభవములఁగూర్చి చెప్పుకొనుట యతనికి సహాయకారి గాదు. అతని యనుభవములలో నిమిడియున్న క్రియాత్మకశక్తి పదములలోనికి దింపఁబడినచో అది విశేషముగా నావిరియై పోవును. అట్లుగాక మఱియొక విధముగా, గురువు తన యనుభవములను శిష్యులకు వివరించిచెప్పుటద్వారా ఆ శిష్యుల అర్థము చేసికొనుశక్తికిని, తద్ద్వారా వారి యభివృద్ధికిని అతఁడు శక్తిమంతముగా సహాయపడును. ఒకదానికొఱకు మఱియొకదాని నెంతవరకుఁద్యాగము చేయఁగలఁడో, యెంతవరకుఁ ద్యాగము చేయవలెనో దానిని గురువు తన విజ్ఞానముతోఁ దానే తెలిసికోఁగలడు. గురువు తా నొక దానిని వివరించునపుడు దానిలోఁ దన ఆడంబరముగాని వ్యర్థ ప్రగల్భతగాని ప్రవేశపెట్టఁ గూడదను విషయము వేఱుగాఁ జెప్పనక్కరలేదు. ఎందుకనఁగా, ఆసంభాషణమందు డంబమేకొంచె మున్నను, అది యతనిని గురువుగాఁగాక వంచకునిగాఁ జేసివేయును.

శిష్యునిగురించి నే నిట్లుచెప్పెదను. ఏసందర్భమునందైనను గురువు తా నెట్టివాఁడైనను ఆతనియందు విశ్వాస పరుఁడవుగమ్ము. నీ వెంతవఱకుఁబోవ సమర్థుఁడవో అంతవఱకు

నీ కాతఁడు మార్గదర్శకుఁడుగా నుండును. అయినను, దైవ మునే నీ గురువుగాఁ బొందఁగలుగు నదృష్టము నీకున్నచో నీవుపొందు సిద్ధికిఁ బరిమితియే యుండదు.

అయినప్పటికిని, దైవమే యీభూమియం దవతారము నెత్తినను అతఁడుగూడ నిటువంటి యభివృద్ధి నియమములకు గురియైనవాఁడే యగును. ఆ దివ్యావతారము వ్యక్తమగుటకు సాధనమైన—అనఁగా, నతని కుపాధిగానున్న—భౌతిక శరీరము నిరంతరాభివృద్ధినిబొందు పరిస్థితియందుఁ దప్పక యుండవలెను. మఱియు, నతని వ్యక్తిగతమైన స్వాయమావిష్కరణమును గాపాడుచున్న ధర్మ మొకవిధముగా భౌతికాభివృద్ధికి సంబంధించిన సామాన్యధర్మసూత్రముతోఁ బెనవేయఁబడినదిగా నున్నది. ఈ విధముగా, మానవులు పరిపూర్ణత నర్థము చేసికొనుటకును అంగీకరించుటకును సిద్ధముగా లేకున్నను, మఱియు సిద్ధమగునంతవఱకును దేహధారియైన దేవుఁడుగూడ నీభూమియందుఁ బరిపూర్ణుఁడు కాఁజాలఁడు. తమ విధేయ ధర్మముగా నిప్పుడు చేయునట్లుగాక, దేవునిఁగూర్చి కేవల ప్రేమతోనే సర్వ మెప్పుడుచేయఁబడునో అప్పుడా పరిపూర్ణతాదినము వచ్చును. అప్పు డభివృద్ధి యొక సంతోషముగా—ఒక ప్రయత్నము యొక్కయుఁ, కడకుఁ బలుమారు చేయు పోరాటముయొక్కయు స్థానమున నుండును. లేక, ఇంకను కచ్చితముగాఁ జెప్పవలయునన్న: అభివృద్ధియనునది పూర్ణ

సత్తతో దైవమును నిందుగాఁ గొఁగిలించుకొనుటతో నేర్పడు నానందముద్వారానే కలుగును; కాని గొప్పప్రయత్నమునకు, మఱికొన్ని సమయములందు గొప్పబాధలకు నాకరమైన యహంకార ప్రతిఘటనను నిరోధించుటద్వారా గలుగదు.

ముగింపుకొఱకై నేను నీకిది చెప్పెదను. నీసంభాషణము సత్యమునే వెల్లడింపవలెననియు వాక్ఛక్తిని సంపాదింపవలె ననియు నీవు కోరినచో, నీవు చెప్పఁబోవుదానినిగూర్చి ముందుగా నాలోచింపకుము. ఏదిచెప్పుట బాగో ఓగో ముందుగ నిర్ణయింపకుము. నీవు దేనిని చెప్పఁబోవుచున్నావో దాని ప్రయోజనము ఎట్టిదిగా నుండవచ్చునని లెక్కింపకుము. నీ మనసునందు నిశ్శబ్దముగా నుండుము. యథార్థ ప్రవృత్తి యందు నిలుకడగానుండుము. విశ్వవివేకమువైపు, విశ్వవిజ్ఞానమువైపు, విశ్వచైతన్యమువైపు ఎడతెగని యాకాంక్షయే యథార్థప్రవృత్తి యగును. నీ యాకాంక్ష నిజమైనదైనచో, 'పనులను జక్కఁగాఁ జేయవలెను; విజయము పొందవలె' నను కోరికలకది కేవలమొక ముసుగుగా నుండకపోయినచో, అది పరిశుద్ధము —— స్వతస్సిద్ధము —— పరిపూర్ణము నైనచో, అప్పుడు నీవు సహజముగా మాట్లాడుదువు. నీవు పలుకవలసిన పదములనే —— ఎక్కువ తక్కువ లేకుండఁ —— బలికెదవు. ఆ వాక్కులు అమోఘ సృజనశక్తి గర్భితములైయుండును.



# 3

ప్రేమ తపస్య యనఁగా: భావస్ఫురణలకు భావావేశములకు సంబంధించిన తపస్య. ఇది అన్ని తపస్యలకంటె మిగులఁ గష్టమైనది.

నిజమునకు, "విధికృతము" అను ఒకానొక భావము అన్నిరంగములందుకంటె మానవుని భావస్ఫురణ రంగమున ముఖ్యముగా నుండును. అది అతనికి అనివార్యమైనదిగ, ఆపరానిదిగ, అతనిపై నధికారము నడుపునదిగ, అతడు తప్పించుకొనుటకు సాధ్యముగానిదిగ నుండును. ప్రేమ యనునది (మానవులు కనీసముగా దేనికా పేరు పెట్టెదరో అది) ముఖ్యముగా నొక నిరంకుశాధికారిగాఁ జూడఁబడుచున్నది. ఆ నిరంకుశాధికారి చాపల్యముల నేమానవుఁడును ఉదాసీనము చేయుటకు వీలుకాదు. అతఁడు తన యిష్టమువచ్చినట్లు నడచుటకు నీపై దెబ్బతీయును. నీ కిష్టమున్నను లేకున్నను తనకు విధేయుఁడవౌనట్లు ని న్నతఁడు నిర్బంధించు చుండును. ఆ ప్రేమయొక్క పేరుపైన అధమాధమములైన దుష్కృత్యములు నిర్వర్తింపఁబడినవి; అత్యంతక్రూరములైన అపరాధములు చేయఁబడినవి.

అయినను, మానవుఁ డీ ప్రేమశక్తిని నియమితముఁ జేయ

నాసపడుచు, దీని నప్రమత్తము, విధేయము చేయుటకై యనేక విధములైన నైతిక సాంఘిక నియమములను గనిపెట్టెను. ఎట్లైనను, ఈ నియమములు "ఎప్పుడైనను ఉల్లంఘింపఁ బడుటకే సిద్ధము చేయఁబడినవా" యన్నట్లును, "ప్రేమయొక్క హఠాద్విజృంభణశక్తిని వృద్ధిచేయుటకే దాని స్వచ్ఛంద వ్యాపారమును నిరోధించు నిబంధనలను విధించునవిగా నిర్మింపఁ బడినవా" యన్నట్లును గనఁబడుచున్నవి. ఎందుకనఁగా, ప్రేమవ్యాపారములు నియమములచేతఁ బాలింపబడునవి కావు. దమించుటకు శక్యముకాని ప్రేమావేగములను ఉన్నతతరమును, శ్రేష్ఠతరమును, యథార్థతరమైన ప్రేమశక్తి మాత్రమే వశపఱచుకోఁగలదు. ప్రేమ యొక్కటిమాత్రమే-ప్రేమను ప్రకాశవంతము చేయుటచేతను, పరివర్తనము చేయుటచేతను, విస్తరింపఁజేయుటచేతను—దానిపై నధికారము చేయఁగలదు. ఎందుకనఁగా, అన్నిసందర్భములకంటె నధికముగా ఈసందర్భమునఁ ప్రేమ నియమనము దాని నణఁచిపెట్టుటయందును తొలఁగించుటయందునుగాక, ఉత్కృష్టపఱచు రసవాదపద్ధతి ద్వారా దానిని రూపాంతరము చెందించుటయందే యిమిడి యున్నది. అందువలన, నీ విశ్వమునందుఁ బనిచేయు నన్ని శక్తులలోను ప్రేమ మిక్కిలి శక్తిమంతమైనది: దుర్దమమైనది. ప్రేమయొకటి లేకున్నచో నీ ప్రపంచ మచేతనత్వముయొక్క అయోమయస్థితియందుఁ దప్పక వెనుకకుఁ బడిపోఁగలదు.

నిజమునకుఁ జైతన్య మీ విశ్వమునకు సృష్టికర్త; ప్రేమ దానికి సంరక్షణకర్త. సచేతనానుభవ మొక్కటే "ప్రేమ యన నేది? అది యెందుకున్నది? యెట్లున్నది?" అను వాని క్షణదర్శనము నీయగలదు. సచేతనానుభవమును గూర్చిన యెట్టి వాఙ్రూప లేఖనమైనను అది యవశ్యముగా ననిర్వాచ్యమైన ఆ యనుభవముయొక్క మానసిక వేషధారణమే యగును. తత్త్వజ్ఞులు ఆత్మవిదులు గూఢవిద్యావిధిజ్ఞులు దీనికై విఫల ప్రయత్నములు చేసిరి. వా రెచ్చట విఫలురైరో అచ్చట నేను విజయము పొందుదునని యభినయింపను. ఆమహాత్ముల రచనలలో నవ్యక్తము పరస్పరాన్వితమునగు పద్ధతిలోనున్న ట్లున్నదానిని సాధ్యమైనంత తేలిక పదములలోఁ జెప్పుటయే నా పని. ఆ సచేతనానుభవజీవితమువైపు దారిచూపుటకంటె మఱియొక లక్ష్యము నా పదములకు లేదు. శిశువునకుఁగూడ దారిచూపుటకే నే నుద్దేశించుచున్నాను.

ప్రేమయొక్క సారము తాదాత్మ్యానందము. ఏకీభావ సమ్మోదమందే ప్రేమ దాని పరమాభివ్యక్తిని పొందును. ఈ రెంటి నడుమనే విశ్వాభివ్యక్తములైన ప్రేమదశ లన్నియుఁ గలవు.

సృష్ట్యారంభమునందు ప్రేమ యనునది పరిపూర్ణైక్యమువైపు ఆవేగము పొందుచున్న పరస్పర పరిపూరకములైన రెండు ధ్రువములయొక్క వ్యాపారద్వయముతోఁగూడినదై,

దాని ఉత్పత్తిమూలముయొక్క పవిత్రతయందున్నది. ఒక వైపున అది ఆకర్షణముయొక్క పరమశక్తిగను, రెండవవైపునఁ బరిపూర్ణాత్మత్యాగము యొక్క దుర్నివార్యావసరముగను ఉన్నది. ఎప్పుడు ప్రత్యేకవ్యక్తియందలి చైతన్యము దాని యుత్పత్తిమూలమునుండి వేరుచేయఁబడి అచేతనత్వమునఁ బడునో అప్పుడా త్రవ్వఁబడిన గొప్ప యఖాతముపై నొక వంతెన వేయుట కీ ప్రేమవ్యాపారమునకంటె శ్రేష్ఠమైనది మరేదియు లేదు.

ఏతత్త్వము మహాకాశములోనికి వ్యాప్తతము చేయఁబడెనో అది తద్ద్వారా సృష్టింపఁబడిన విశ్వమునకు నాశనము కలిగించకుండ దానిలోని కదే వెనుకకుఁ దీసికొనిరాఁబడవలసి యున్నదిగదా! అందువలననే అప్రతిహత సంయోగశక్తియగు ప్రేమ తటాలునఁ బెటిలి ముందుకువచ్చినది.

ఈ ప్రేమ అంధకారముయొక్కయు నచేతనముయొక్కయు నుపరిభాగమున నెగురుచున్నది. ఇది యగాధమైన నిశా హృదయమునందుఁ దనకుదానే చెదరి పడుచున్నది; తనకుఁ దానే చూర్ణీకృతమగుచున్నది. అప్పటినుండియే దీనియం దొక మేలు కాంచుటయు, ఊర్ధ్వగతియు, మెల్లగా జడపదార్థము రూపొందుటయు, దాని అనంతమైన పురోగతియుఁ బ్రారంభమైనవి. అన్నమయ ప్రాణమయ ప్రకృతియొక్క సర్వప్రేరణలతోఁ గలిసికొన్నదై, ప్రతివ్యాపారమును ప్రతి

సంఘీకరణమును ప్రోత్సహించుచుఁ, బొరపడునట్టియు నస్పష్టమైనట్టియు ఆకారముక్రిందనుండిన ఇయ్యది ప్రేమకాదా? ఇది వృక్షప్రపంచమునందు స్పష్టముగాఁ జూడఁదగినదై యున్నది. చిన్నమొక్కయందును వృక్షమునందును మునుపటికంటె నెక్కువ వెలుతురును ఎక్కువ గాలిని ఎక్కువ స్థలమును బొందుటకొఱకైన యభివృద్ధ్యవసరముగా నీప్రేమ యున్నది. పుష్పమునం దీప్రేమ దాని మనోజ్ఞవికసనమునందలి సౌందర్య పరిమళభాగ్యముగా నున్నది. మఱియు జంతువునందు దాని ఆకలిదప్పుల వెనుక నున్నదియు, దాని స్వార్థోపభోగము కొఱకును విస్తరణకొఱకును సంతానముకొఱకు నవసరమైనదియు,—సంగ్రహముగాఁ జెప్పవలెనన్న అవి సచేతనములు కావచ్చును; గాకపోవచ్చును—అట్టి అన్నికోరికల మఱుగున నున్నట్టిది ప్రేమకాదా? అట్లే, అంతకంటె నున్నతశ్రేణుల లోనిది, స్త్రీ తన చిన్నబిడ్డకొఱకుఁ జేయు స్వార్థత్యాగ పూర్వకమైన ఆత్మార్పణమునం దున్నట్టిది ప్రేమకాదా? ఈ విషయము మనలను సహజముగనే మానవజాతికడకుఁ దీసికొనిపోవుచున్నది. ఇచ్చటనే మానసిక వ్యాపారముయొక్క విజయవంతమైన ఆగమనముతోఁ గూడుటచే ఈప్రేమసంసర్గము దానియున్నతశిఖరముల నందుకొనుచున్నది. ఎందుకనఁగా, నిది యిచ్చట నెఱుకతోఁగూడినది; బుద్ధిపూర్వకమైనది. నిజమునకు, భౌమికాభివృద్ధి యిట్లు సాధ్యమైనవెంటనే ప్రకృతి

బలిష్ఠమైన యీ ప్రేమశక్తిని సంతానోత్పాదక వ్యాపార ముతోఁ గలుపుటద్వారా, జతపఱచుటద్వారా తన సృష్టి క్రియా విధానమున కుపయోగపడునట్లు చేసెను. ప్రేమతోడి ఈ అన్నమయ ప్రాణమయ మనోమయ ప్రజనన వ్యాపారముల సంసర్గము-పై రెంటిని విడఁదీయుటకును, ప్రత్యేకముగా వాని యనుభవము పొందుటకును సమర్థమై చాలినంత ప్రకాశవంత మైన చైతన్యముగలవారు నిజమునకుఁ జాల కొలదిమంది మాత్రమే యుండునట్లుగా—అంత సన్నిహితమైనదిగా, అంత అభిన్నమైనదిగా నేర్పడినది. ఈవిధముగాఁ బ్రేమ అన్ని యధో గతులకు భ్రంశముపొందినది; కడకది పశుత్వపు నీచస్థితికి దిగివచ్చినది.

ఈ క్షణమునుండియే, ఒకదానికంటె నొకటి యత్యంత సంశ్లిష్టములు నసంఖ్యాకములునైన సంఘీకరణములద్వారా తరగతులతో నంతస్తులతో నాదిమమైన యేకత్వమును మరల సృష్టింపవలెనను ప్రకృతియొక్క యిచ్ఛకూడ ఆ ప్రకృతికార్య కలాపములయందు స్పష్టముగాఁ గనఁబడినది. ఈప్రకృతి యిద్దఱు మానవవ్యక్తులను దగ్గరికిఁ జేర్చుటకును మిథునముల జంటను సృష్టించుటకును ప్రేమశక్తి నుపయోగిం చెను. ఇదియే కుటుంబమూలము. ఈప్రకృతి వ్యక్తిగతా హంకారమును ద్వంద్వాహంకారములోనికి మార్చుటచేత దాని సంకుచిత పరిధులను విడఁగొట్టి, సంతానము కనుటతో

నత్యంత సంశ్లిష్టమైన ఏకత్వమును వ్యక్తిలోనికిఁ బ్రవేశ పెట్టెను. ఇదియే కుటుంబము. కొంతకాలము జరుగుచుండఁగా, నీ కుటుంబముల నడుమఁ బెక్కుమడుపులతోడి కలయిక ద్వారా, ప్రత్యేకవ్యక్తులయొక్కయు రక్తమిశ్రణముయొక్కయు నడుమఁ బరస్పరాంతః పరివర్తనముద్వారా ఒకజాతియొక్క సృష్టిలో చివరకు "తెగ, వర్ణము, కులము, తరగతి" యను విశాలతర సంఘీకరణములు కనఁబడెను. సంఘములుగా నేర్పడు నీకార్యము ప్రపంచమునందు వేఱువేఱుభాగములయందేక కాలమునందే నడిచెను. ఈ సంఘీకరణము వివిధజాతులుగా స్ఫటికములవలె నిర్దిష్టరూపములు ధరించెను. మానవైకత్వముకొఱకు భౌతికము యథార్థమునైన యొక మూలాధారము నిర్మించుటకొఱకైన తన ప్రయత్నమునందుఁ బ్రకృతి యీ జాతుల నన్నింటినిగూడఁ గ్రమాంతరముగా నొకదానితో నొకటి కలిసిపోవునట్లు కరగిపోయును.

మానవులలో ననేకుల చైతన్యమున కిదంతయు జీవితమునందొక యదృచ్ఛాసంభవమైన క్రీడగాఁ గనఁబడుచున్నది. వా రొక విశ్వప్రణాళిక యుండుటను గమనింపరు. వారు పరిస్థితులను—అవి తమ స్వభావమునుబట్టి మంచివైనను చెడ్డవైనను—అవి యెట్లువచ్చినవో అట్లే తీసికొందురు. కొందరు తృప్తిపడుదురు; ఇతరు లతృప్తిపడుదురు.

తృప్తిపడినవారిలో నొకతరగతి మానవులు ప్రకృతి

విధానావస్థితితో సంపూర్ణసామరస్యము చెందువా రున్నారు. వీ రెన్నటికైన శుభమువచ్చునను నమ్మకము గలవారు. అట్టి వారికి రాత్రియొకటియున్నదిగాన పగలు మిక్కిలి ప్రకాశ వంతముగానుండును; నీడ లున్నవిగాన రంగులు కాంతిమంత ములుగా నుండును; బాధలుండుటవలన సంతోషము అత్యు త్కట మైనదగును; దుఃఖము సుఖమున కెక్కువ మనోహ రత్వము నిచ్చును; రోగము ఆరోగ్యమునందు దాని విలువ నంతయు నిలువచేయును. "నాకు శత్రువులున్నందుకు నేను హర్షించుచున్నాను. ఎందుకనఁగా, నిందువలన నా మిత్రుల గుణములను నే నెక్కువగా గ్రహింపఁ గలుగుచున్నా" నని కొందఱు చెప్పుటకూడ నేను వింటిని. ఎట్లైనను, అటువంటి వారికి దాంపత్యవ్యాపారము మిక్కిలిప్రియమైన ప్రవృత్తిగా నుండును; జిహ్వాతృప్తి విడువరాని జీవితసుఖములలో నొకటి గానుండును; పుట్టినవాఁడు తప్పక చావవలెననుట మిక్కిలి సహజముగానుండును: జీవితప్రయాణము మిక్కిలి దీర్ఘముగా సాగినచో విసుగుపుట్టించును; అట్టిప్రయాణమునకు మరణ మొక హద్దుగీయును.

సంగ్రహముగాఁ జెప్పవలెనన్న, ఇప్పుడున్నజీవిత మిది యిట్లే చాల బాగుగనున్నదని వారు గుర్తింతురు. ఈ జీవిత మున కొక కారణముగాని ప్రయోజనముగాని యున్నదని తెలిసికొనుటకుఁగూడ వారు లక్ష్యపెట్టరు. ఇతరుల దురవస్థ

నుగూర్చి వారు బాధపడరు. అభివృద్ధ్యావశ్యకతను దేని నైనను వారు చూడరు.

అటువంటివారి "ఉత్తమ పరివర్తనమునకు" నీ వెప్పుడును ప్రయత్నింపనే కూడదు. ఇది మిక్కిలి ప్రగాఢమైన యపరాధ మగును. దురదృష్టవశమున నీమాట విన్నచో వారు మఱి యొక క్రొత్తస్థితిని బొందలేరు గాని, అప్పటి తమ సమస్థితిని బోఁగొట్టుకొందురు. వా రాంతరికజీవితమునకు సిద్ధముగ లేరు. గాని, వారు ప్రకృతికి ముద్దు బిడ్డలు. వారు ప్రకృతితో మిక్కిలి సన్నిహిత సంబంధము కలిగియున్నారు. వారి ఈ యుపలబ్ధికి నిరుపయోగముగా భంగము కలిగింపఁగూడదు.

ఈప్రపంచమునఁ దృప్తిపడినవారిలో, పైవారికంటె నించుక తక్కువతరగతివారును తక్కువకాలము నిలువగల వ్యాప్తిగలవారును కొంద ఱున్నారు. వారి సంతృప్తి ప్రేమ కలాప నిర్వర్తనమునందలి మోహాకర్షణమువలన నేర్పడు చున్నది. ఒకవ్యక్తి తనవంటి మఱియొక మానవవ్యక్తి కొఱకో కుటుంబముకొఱకో దేశముకొఱకో తన విశ్వాసము యొక్క మేలుకొఱకో—దేనికొఱకైనఁ గావచ్చును—ఆత్మ త్యాగముచేయుటద్వారా స్వేచ్ఛావాయువులలోనికిఁ బైకెగు రుచు, 'నేను' అను భావముచేత నేచెరయందు బద్ధుఁడై యున్నాఁడో దాని సంకుచితపరిధుల నాత్మత్యాగముచేయు ప్రతి పర్యాయము తెగఁగొట్టుచున్నాఁడు. అతఁ డా యాత్మత్యాగ

మునఁ దన్నుఁదాను మఱచుటయందే ప్రేమానందముయొక్క తొలి రుచిని చవిచూచుచున్నాఁడు. ఈయనుభవ మాతనికి 'దైవముతో సంబంధము కలిగించుకొంటి'నను భావస్ఫూర్తిని బుట్టించుచున్నది. అయినను ఇది చాలభాగ మస్థిరసంబంధమే యగును. ఎందుకనఁగా, మానవునియందలి ప్రేమ—దానిని మలినపఱచునట్టియు, దాని పవిత్రశాశ్వతశక్తినంతటిని బోఁగొట్టునట్టి యహంకారపూరిత నీచవ్యాపారములతో వెంటనే మిశ్రితమగుచున్నది. ఒకవేళ ఈప్రేమ అప్పటికిని బరిశుద్ధమైనదిగ నుండినను, దైవసత్తతోడి యీసంబంధమును శాశ్వతముగ నది సహించుకొని యుండఁజాలదు. ఎందుకనగా, ప్రేమయనునది దైవాంశములలో నొకటిమాత్రమే యగును. తక్కిన దైవాంశముల వలెనే యీప్రేమకూడ నీ భూమియందుఁ బెక్కు వికృతులకు లోనైనది.

ఎట్లైనను, ఈయనుభవము లన్నియు భవిష్యదేకత్వము వైపు డోలాయమానముగాఁ బురోగమించు ప్రకృతియొక్క సాధారణ మార్గము ననుసరించు సామాన్య మానవునికి మిక్కిలి శ్రేయస్కరములైనవి-మిక్కిలి యుపయుక్తములైనవి. అయినను, ఇవన్నియు నుత్తమ పరివర్తనసిద్ధికి త్వరితపఱుపఁగోరు వారిని తృప్తిపఱుపఁజాలవు. వారు ఇంతకంటె సూటియైనదియు శీఘ్రతరమైనదియు నగు నూతనమార్గము నవలంబింపఁ గాంక్షించువారు. ఆప్రత్యేకమార్గము వారిని సాధారణ మానవ

స్వభావమునుండియు, దాని అంతములేని గమనమునుండియు విముక్తినొందించి, ఒక నూతనజాతిని సృష్టించు శీఘ్రతమ మార్గమువెంట నడిపించి, ఆధ్యాత్మికాభివృద్ధియందుఁ బాల్గొనునట్లు చేయునది. ఆ రాఁబోవుజాతియే యీ భూమియందు అతిమానససత్యమును వెల్లడింపఁగలదు. ఈ నూతనమార్గాకాంక్షులైన విశిష్టాత్ములు మానవవ్యక్తుల నడుమఁ బరస్పరముండు ప్రేమనంతటిని దప్పక తిరస్కరింపవలెను. ఎందుకనఁగా—ఈప్రేమ ఎంత సుందరము ఎంతపవిత్రమైనదైన నగుఁగాక—ఇది మానవులలో నల్పప్రసారావాంతర మండలములను సృష్టించును; మఱియు దైవముతోనున్న సాక్షాత్సంబంధమును ద్రెంచివేయును.

ఎవఁడు దివ్యప్రేమను దెలిసికొనెనో అతఁడు తక్కిన ప్రేమనంతటిని మలినమైనదానినిగను, అల్పత్వముతో నహంకారముతో నంధకారముతోఁ గలిసినదానినిగను కనుఁగొనును. అది ఆధిక్యముకొఱకును అధికారముకొఱకును జరుగు నొక పోరాటమువలె, ఒక బేరమువలెఁ గనఁబడును. మానవులలో నుత్తములైనవారియందుఁగూడ నీప్రేమ అపార్థములతో, మృదుహృదయబాధలతో, రాపిళ్లతో, అనుమానములతో నిండియుండును.

ఇదియునుగాక, "నీవు దేనిని ప్రేమించెదవో తద్రూపముగనే నీవు పెరిగెద" వనుట యందఱెఱిఁగిన విషయము.

అందువలన నీవు దైవమువలె నుండఁదలచినచో ఆదైవమును మాత్రమే ప్రేమించుము. ఎవఁడు దైవముతోడి ప్రేమానుసంధానానంద పారవశ్యము ననుభవించునో అతఁ డొక్కఁడు మాత్రమే తక్కినప్రేమ లెంత నిస్సారములైనవో యెంత జడములైనవో యెంతదుర్బలములైనవో పోలిక లెంచి తెలియఁగలఁడు. ఈ దివ్యప్రేమానుసంధానస్థితిని బొందుట కెంత తీవ్రతమమైన శిక్షణ మత్యవసరమైనప్పటికిని అది యాదైవసన్నిధానమునకుఁ దీసికొనిపోయినచో అప్పు డేదియైనను మిక్కిలి కఠినమైనదికాదు, మిక్కిలి దీర్ఘమైనదియు కాదు; మిక్కిలి తీక్ష్ణమైనదియుఁగాదు. ఎందుకనఁగా, ఈప్రేమానందము సమస్త వాగ్వ్యాపారమున కతీతమైనది.

• ఈ యద్భుతస్థితినే మే మీభూమియందు సాధింపఁదలఁచితిమి. ఈ ప్రపంచమును బరివర్తనముచేసి, దీనిని దైవసాన్నిధ్యమున కర్హమైన నివాసముగాఁ జేయఁగలిగిన దిదియే. అప్పుడే పవిత్రము సత్యము నగుప్రేమ శరీరమునం దవతరించును. ఆశరీర మాప్రేమకు వేషముగాఁగానిఁ ముసుగుగాఁగాని యెంతమాత్ర ముండఁజాలదు. ఈ శిక్షణమును సులభతరము చేయుటకును, మిక్కిలి సన్నిహితము ప్రత్యక్షమునగు ఆంతర్యము పుట్టించుటకును ప్రేమయొక్క పరమాకారము క్రింద దైవము పెక్కుమారులు ప్రయత్నించెను. ఇందుకొఱకే దైవము మానవాకృతివంటి భౌతిక దేహమును ధరించెను.

కాని, యెల్లప్పుడును స్థూలమైన యీ భౌతికశరీరమునందే బంధింపఁబడినవాఁడై, తనకుఁదాను తన వికృతాకారపు బొమ్మనే వెల్లడింపఁ జాలినవాఁడాయెను. మానవులు తమ చైతన్యము నందును శరీరమునందును అపరిత్యాజ్యమైన యభివృద్ధి నెప్పుడు సాధింతురో అప్పుడే దైవము తన పరిపూర్ణతా సమృద్ధియందుఁ దనకుఁ దానే యావిర్భవించుటకు సమర్థుఁడగును. ఎందుకనఁగా, మానవుని దాంభికత్వము అందలి నీచత్వము బుద్ధిహీనమైన యతని దురభిమానము — ఉత్కృష్టమైన ఆ దివ్యప్రేమ మానవాకృతియందుఁ దనకుఁ దానే యావిర్భవించుటను బలహీనతయొక్కయుఁ బరాధీనతయొక్కయు అవసరముయొక్కయుఁ జిహ్నముగా గ్రహించును.

అయినప్పటికి, ప్రేమ యొకటి మాత్రమే ప్రపంచమునందలి బాధల నంతరింపఁ జేయఁగలదని మానవుఁడు మొదట మొదట నస్పష్టముగా నెఱిఁగియున్నను, అతఁడు పరిపూర్ణత వైపు పురోగమించుకొలదిని క్రమక్రమాధికముగా మిక్కిలి స్పష్టముగా నెఱుఁగఁ గలఁడు. అనిర్వచనీయములైన ప్రేమానందములు అందలి పరమాంశములు మాత్రమే యెడబాటునందలి బాధాజ్వాలలను బ్రపంచమునుండి తుడిచివేయఁగలవు. ఎందుకనఁగా, పరమైకీభావ పరవశతయందే సృష్టి తన ఉనికికిఁ గారణమును సార్థక్యమును గుర్తింపఁగలదు.

భౌతిక పదార్థరూపమును ప్రకాశవంతము పరిశుద్ధము

పరిపూర్ణ పరివర్తితము చేయఁగలిగినచో అప్పుడే ప్రయత్న మైనను దుష్కరమైనదికాదు; ఏ తపస్యయైనను గఠినమైన ది కాదు. అందువలన దైవము అట్టి భౌతిక పదార్థమునం దొక బాహ్యాకారము ధరించినపు డాపదార్థము దైవము నిఁక నెంతమాత్రము మఱుగుపెట్టఁజాలదు. ఏలయనఁగా, ప్రేమ యొక్క యద్భుతప్రభావ మప్పుడు ప్రపంచమునందు స్వాచ్ఛంద ముగా స్వయంవ్యక్తమగును. ఆ దైవికమైన ప్రేమయే జీవి తము నొక మధురానందస్వర్గముగా మార్చుటకు శక్తిమంతమై యుండును.

ఇది పరమసిద్ధియని, ప్రయత్నమునకుఁ గిరీటమువంటిదని, చివరి విజయమని మీరు చెప్పవచ్చును. కాని, ఈ స్థానము చేరుటకు ఏమిచేయవలెను? దీని ననుసరించుటకు మార్గమేది? ఆమార్గమునందుఁ బ్రథమసోపానము లేవి?

దైవముతోడి మన వ్యక్తిగతసంబంధము కొఱకుఁ బ్రే మను దాని పరిపూర్ణశోభతోఁ బ్రత్యేకించియుంచుటకు నిశ్చ యించుకొన్నాము గనుక, ఇతరులతో మనకున్న ప్రేమసంబం ధమునందు హృదయపూర్వకము అవ్యభిచరణశీలము అవిరత ము అహంకారరహితము నగు కరుణాపరత్వమును సుహృ ద్భావమును నిలుపవలెను. ఈప్రేమ యెట్టి పారితోషికమును ఎట్టి కృతజ్ఞతను, కడకెట్టి ప్రత్యభిజ్ఞనైనఁ గోరఁగూడదు. ఇతరులు ని న్నాదరించుపద్ధతి యెట్టిదైన నగుఁగాక; ఆగ్రహ

ము నిన్ను నడిపించినట్లుగా నీవు నడుచుట కవకాశ మియ్యఁ గూడదు. మఱియుఁ, బవిత్రము అసమ్మిశ్రితము నగుప్రేమ దైవమునందు నీకున్నది గనుక, ఇతరులు ని న్నర్థముచేసి కొనకపోవుటకును ద్వేషించుటకును విరుగుడుగా, ఆదైవమే నిన్నెట్లు కాపాడునో ఎట్లు సమర్థించునో ఆ విషయమును 'ఎక్కటి తీర్పరి' గా ఆదైవమునకే విడిచిపెట్టుము.

నీసంతోషములను సుఖములను దైవమునుండిమాత్రమే ప్రతీక్షించుము. ఆదైవమునందు మాత్రమే నీవు సహాయము ను ఆశ్రయమును వెదకి కనుఁగొందువు. అన్నిబాధలయందు ని న్నాదైవమే యోదార్చును. మంచిమార్గమున నడుపును. నీవు తొట్రుపడినచో లేవనెత్తును. మూర్ఛిల్లిన—శోషిల్లిన సమయములు వచ్చినచో నిన్నాదైవము తన దృఢమైన ప్రేమ మయ బాహువులలోనికిఁ దీసికొని తన ఆప్యాయనమైన మాధుర్యమునఁ దేల్చును.

ఇచ్చట సాధారణముగాఁ గలుగఁబోవు నొక యపార్థ మును దొలగించుటకై నేనొక విషయము నెత్తిచూపవలసి యున్నది. నే నేభాషలో మాటలాడుచున్నానో ఆ భాష విధించు నియమమువలన దైవముగూర్చి చెప్పునప్పుడు పుంలింగ రూపమునే విధిగా ఉపయోగించుటకు నిర్బంధింపఁబడుచున్నా ను. అయినను, నిజమునకు నేను ప్రేమయని చెప్పుచున్న సద్వస్తువు స్త్రీ పుంలింగములవంటి అన్నిలింగములకు అంటని

ది—అతీతమైనదనుట సత్యము. మఱియు, ఆసద్వస్తువు ఎప్పు డొక మానవశరీరమును గ్రహించునో అప్పుడది చేయవలసిన పనియొక్క అవసరముబట్టి పురుషునియొక్కగాని స్త్రీయొక్క గాని దేహమును అభిన్నభావముగనే కోరుకొనును.

సంగ్రహరూపమున, 'భావతపస్య' యనునది భావావేశ పూరితములైన రాగబంధము లన్నిటిని—అవి యద్వితీయము లైనవైనను, ఒకవ్యక్తికొఱకో ఒక కుటుంబముకొఱకో ఒక దేశముకొఱకో లేక మఱియేదో లక్ష్యముకొఱకో ఉద్దేశింపఁ బడినవైనను — వాని నన్నిటినిఁ దిరస్కరించుటయందును, దివ్యసత్యముకొఱకైన రాగబంధమునందు మాత్రమే ప్రత్యేక ముగా మనసు నేకాగ్రముచేయుటయందును ఇమిడియున్నది. ఈ యేకాగ్రత సంపూర్ణ తాదాత్మ్యమునందు దాని యుచ్చ స్థితినిబొంది, ఈభూమియందు అతిమానసిక సిద్ధికొఱ కొక యుపకరణముగాఁ బనిచేయును.

ఇది మనలను ఉపలబ్ధియొక్క మూర్తరూపములైన విమో చనచతుష్టయముకొఱకు సహజముగనే తీసికొనిపోవును. భావా వేశ విమోచనమనునది అతిమానసిక్యైక్యముయొక్క సంపూ ర్ణోపలబ్ధియందు ఆసమయముననే బాధావిమోచనముగఁగూడ నగును. మానసిక విమోచనము—లేక—అజ్ఞాన విమోచన మనునది పురుషునియందు జ్యోతిర్మయ మనస్సును—లేక— విజ్ఞానమయ చైతన్యమును బ్రతిష్ఠించును. అది తనకుఁదానే

అమోఘవాక్కు యొక్క సృజనశక్తియందు వ్యక్తమగును.

ప్రాణమయ విమోచనము—లేక—వాంఛావిమోచన మను నది వ్యక్తిగతేచ్ఛకు దైవేచ్ఛతో సచేతనముగాఁ బరిపూర్ణ ముగాఁ తాదాత్మ్యముఁ బొందుశక్తినిచ్చును. మఱియు నిదియే ఫలప్రదశక్తిని తెచ్చినట్లే శాంతిని దాంతిని తీసికొనివచ్చును.

చివరగా, భౌతిక విమోచనము—లేక—భౌతిక కార్యకార ణత్వ ధర్మవిమోచన మనునది అన్నింటికి శిరోభూషణము గావచ్చును. ఎట్లనఁగా, నీయంతకు నీవు పూర్తిగా స్వతంత్రు డవు. అధశ్చేతనము యొక్కయు అర్ధజాగృతి యొక్కయుఁ ప్రేరణలద్వారా నీచేతఁ బనిచేయించునట్టియు, సాధారణ జీవితమను బండి జాడలో నిన్ను నడుపునట్టియు ప్రకృతిధర్మము లకు నీవేమాత్రము బానిసగా నుండఁజాలవు. కాఁబట్టి యీ విమోచనము వలన నీ వనుసరింపఁదలఁచిన మార్గమును సం పూర్ణజ్ఞానముతో నీవు నిర్ణయించుకొనఁగలవు నీవు సాధింపఁ దలఁచిన కార్యమును కోరుకొనఁగలవు. అంధప్రాయమైన విధివశత్వభావము లన్నిటినుండి నీవు విడివడఁగలవు. నీ జీవిత మార్గమునందు అత్యుత్తమేచ్ఛకంటెను బరమ సత్యజ్ఞానము కంటెను అతీతమానస చైతన్యముకంటెను మఱి యేదానిని నడుమఁ బ్రవేశింపనీయవు.



Imprimerie de Sri Aurobindo Ashram Pondichéry 861/11/54/1000

